# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

అమరుల మెప్పించి అప్సరసల పరిణయమాడిన
అసాధారణ యువకుని అమర గాథ...

ఆగస్టు
విడుదల



విజయా వారి

# జగదేకవీరుని కథ

డైరెక్షన్... కె.వి.రెడ్డి, B.Sc.(HONS)

రచన.. పింగళి నాగేంద్రరావు... సంగీతం.. పెండ్యాల... నృత్యం... పసుమర్తి... కళ...గోఖలే, కళాధర్... ఫొటోగ్రఫీ... బార్‌ట్లే
రికార్డింగ్.. శివరామ్, B.A. B.Sc.

TARAKA

# వైట్ హార్స్ సబ్బు




**WHITE HORSE SOAP**

.... గుడ్డల మురికిని పోగొట్టుటలో
అగ్రస్థానము వహించినది.
పట్టు, లినన్ గుడ్డల చలువకు శ్రేష్ఠమైనది.

| | |
|---|---|
| బారు ఒకటి: | రు. 1-00 |
| పెద్ద సైజు కేకు: | 0-31 న. పై. |
| మీడియం సైజు: | 0-19 న. పై. |
| శాంపిల్ సైజు: | 0-07 న. పై. |

తయారుచేయువారు:

## నేషనల్ ఇండస్ట్రీస్,

మదరాసు - 21

---

మృదువైన చర్మమునకు

## ఫెస్టివల్

సూపర్ సాండల్
టాల్కం పౌడర్
అందు
స్నో






ఫోన్: 2788 మురళి ట్రేడర్స్ మదరాసు-21 తంతి: "Mursoks"

ప్రతిచోటా దొరకును

ఆంధ్ర ప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు

M/s. శివకోటి లక్ష్మినరశింహం,

మార్కెట్ స్క్వేయర్ :: విజయవాడ

" రెండిటిలో ఏది కావాలి—
రుచి ప్రధానంగా మిశ్రమంచేసిన
పరిశుద్ధమైన ఇండియన్ కాఫీయా,
ప్రత్యేక తరహాల
ననుసరించి తయారుచేసిన
ఫ్రెంచి కాఫీయా ?"




**PURE INDIAN COFFEE**

**STANES FRENCH**

G. ST. 12

THE UNITED COFFEE SUPPLY COMPANY LIMITED, COIMBATORE.

# పాఠకుల లేఖలు

## ఆగస్టు 1961

"చందమామ" లో ప్రచురించుచున్న సీరియల్స్ మరియు కథలు బాగుంటున్నవి. ఇందుకు పాఠకుల ప్రశంస మరియు మంచి మంచి రచయితల సహకారమని చెప్పక తప్పదు.

—ఎ. వెంకటేశ్వర్లు, జగిత్యాల

దీని మించిన కథల పత్రిక ఈ భారతదేశమందు లేదని చెప్పవచ్చును.

—కాసం యాదగిరి, జనగామ

జూలై నెలనుంచి ప్రారంభించిన "రాకాసిలోయ" సీరియల్ బాగున్నది. వడ్డాది పాపయ్యగారి చిత్రములు చాలా బాగున్నవి.

—ఎస్. జయప్రకాశరావు, తిరువూరు

శ్రీ వడ్డాది పాపయ్యగారు "దక్షయజ్ఞము" కథకు చిత్రించిన బొమ్మలు చాలా బాగున్నాయి....53 పేజీలోని తాటకి బొమ్మ కథలో ఉన్నట్టు లేదు. "చిత్ర కథ"లోని బొమ్మలుకూడ అవక తవకగా ఉన్నాయి.

—బి. పురుషోత్తం, ఖురదారోడ్డు

"రాకాసిలోయ" సీరియల్ అద్భుతంగా ఉంది. అట్టమీది బొమ్మ ఎంత చూచినా తనివితీరుట లేదు. "కూలిడబ్బులు" కథ చాలా బాగుంది.

—వై. రామారావు, శ్రీకాకుళం

"బాలకాండ"కు శంకర్‌గారు వేసిన బొమ్మలు నెల నెలా వృద్ధినొందుచున్నందుకు వారికి నా ధన్యవాదాలు.

—రామిడి లక్ష్మిరెడ్డి, అటవాల

ఈ నెల "చందమామ"లోని కథలు అద్భుతముగా ఉన్నవి.

—బొమ్మదేవర నాగరత్నం, వుయ్యూరు

"దక్షయజ్ఞము" "చందమామ"కే వన్నె తెచ్చిందనుటలో సందేహము లేదు.

—మెంటే బాబ్జీ, భీమవరం

"అనుకోని వివాహం" అన్న [బేతాళ] కథకి శంకర్‌గారు రాజకుమార్తె చిత్రం చాలా బాగా చిత్రించినారు. వారికి నా మనఃపూర్వక అభివందనములు తెలియజేయవలెను. "దక్షయజ్ఞము"నకు చిత్రీకరించిన వడ్డాది పాపయ్యగారికి నా కృతజ్ఞతలు తెలుపవలెను.

—సి. వి. రాజు, విశాఖపట్నం

"నెరవేరిన ప్రతిజ్ఞ" అను కథ "మంగమ్మ శపథం" అను సినిమా కథయే.

—కె. ప్రకాశరెడ్డి, జమ్‌షెడ్‌పూర్

[ఈ రెంటికీ మూలాధారం భట్టి విక్రమార్కుల కథే – సం]

మామయ్యా, మా ఆవిడకు అ ఆ, ఇ ఈ, ఉ ఊ, ఋ ౠ మట్టుకు మాత్రము వచ్చేది. నేను ఒక దినము "మామ"గారి ఏజంటు వద్దనుండి 50 న.పై. లు ఇచ్చి "మామ"ను కాజేసినాను. నాటినుండి మా ఆవిడ "జ్వాలాద్వీపము" సీరియల్ ప్రారంభమునుండి చదివి పూర్తిగా చెప్పినది కనుక "మామ" శక్తివల్లనా, లేక తన భక్తి వల్లనా తెలిపి సంతోషపరచగలరు.

—జి. యోహాన్, డ్రైవర్, ఘుగుస్ కాలియరీ

ఒకప్పుడు "ఆర్య కథానిధి" (వావిలికొలనువారిది) అనే పాకెట్‌సైజు పుస్తకాలు వెలువడేవి. ఆనాడు ఆ పుస్తకాలంటే పిల్లలు ఎంతో సంబరపడేవారు. ఈ నాడు "చందమామ" కథలంటే పిల్లలనే గాకుండా పెద్దలనుగూడ ఆకర్షిస్తున్నందుకు ధన్యవాదములు తెలియ జేస్తున్నాను.

—వి. రమణారెడ్డి, పల్లప్రోలు

ఆంధ్రదేశమంతటా అత్యుత్తమ చిత్రమని కొనియాడబడుచున్నది.

భరణీ వారి

# బాటసారి

నిర్మాత-దర్శకుడు : రామకృష్ణ



# తరచుగా వచ్చే దగ్గు మరియు రొంప ఓపికను తగ్గిస్తాయి... శ్వాసనాళములకు కలిగే అంటువ్యాధులను అడ్డే శక్తిని తగ్గిస్తాయి

దగ్గు మరియు రొంప బాధను కలిగించడమే కాకుండా అవి తరచుగా వస్తూంటే వాటిని గురించి బెంగ పెట్టుకోవలసి వస్తుంది. వాటర్‌బరీస్ కాంపౌండ్‌ను త్రాగుట వెంటనే ప్రారంభించండి.



వాటర్‌బరీస్ కాంపౌండ్

- ★ దగ్గు నుండి మరియు శ్వాస నాళములు పూడుకొని పోవుట నుండి స్వస్థత కలిగిస్తుంది.
- ★ దగ్గు, జలుబులను ఎదుర్కొనే శక్తిని పెంపొందిచును.
- ★ ఆహారము ఒంట పట్టుటలో సహకరిస్తుంది.,
- ★ శరీరములోని అన్ని అవయవములకూ శక్తినిచ్చును




క్రిసోట్ మరియు గైకాల్‌తో పుష్టికరము చేయబడిన వాటర్‌బరీస్ కాంపౌండ్ శ్వాసనాళములు పూడుకొని పోవుటను మరియు చాల కాలము నుండి బాధపెడుతున్న దగ్గు మరియు రొంపను పోగొట్టును. మీ ఒంట్లో ఆరోగ్యమును క్రమపరచి వ్యాధులు రాకుండా చేయుటయే కాక మీరు సంవత్సరము పొడుగునా శక్తి, ఉత్సాహములతో పని చేయుటలో సహకరిస్తుంది. పిన్నా పెద్దా అందరికీ బాగుగా గుణము కలిగిస్తుంది.

మంచి రుచిగల దీనిని - త్రాగండి

## వాటర్‌బరీస్ కాంపౌండ్

(ఎఱ్ఱ లేబిలు)

మీకు శక్తి ఉత్సాహములు యిస్తుంది



ఈ రకమునది కూడ లభిస్తోంది : కేసరి రంగు లేబిలుగల వాటర్‌బరీస్ విటమిన్ కాంపౌండ్. ఇది అన్ని విధములా వాడదగిన టానిక్‌గా సిఫార్సు చేయబడినది

వార్నర్ - లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపింపబడినది)

W-161

పాలీ ఉమ్రీగర్ ఇలా అంటున్నాడు :

# "కండరాల నొప్పులు, అతిశ్రమ, బెణుకులు పోవడానికి నేను వాడేది స్లోన్స్ లినిమెంట్"






మహాద్‌లో ప్రసిద్ధిపొందిన మనిక్ ఎడేకర్ ఇలా అంటున్నాడు : "శీఘ్రబాధ నివారణకు నేను స్లోన్స్ లినిమెంట్‌నే వాడతాను"

ప్రపంచంలోని ఇతర ప్రదేశాలలోలాగే భారతదేశంలో కూడ ఆటగాండ్రు, మల్లులూ— కండరాల నొప్పి, బిగబట్టుట, అతిశ్రమ, బెణుకులు—వీటినుండి విముక్తి పొందటానికి స్లోన్స్ లినిమెంట్ వాడతారు. నొప్పిగా వున్నచోట కొంచెం స్లోన్స్ లినిమెంట్ పూయండి....తక్షణమే కండరాలూ, కీళ్ళూ, వాటి పూర్వపు సహజ మృదుత్వాన్ని పొందుతాయి....బాధోపశమనానికి తగిన వెచ్చదనాన్నిచ్చే స్లోన్స్‌కు కృతజ్ఞులం.




## స్లోన్స్
## లినిమెంట్

వాత నొప్పులు, కీళ్ల నొప్పులు, వెన్ను నొప్పి, పార్శ్వపు నొప్పి, మెడ ఇలుకు—వీటినుండి శీఘ్రనివారణ కల్గిస్తుంది.

సమస్తమైన కండరాల నొప్పుల బాధలను తక్షణమే ఉపశమింప జేయుటలో మూడింతలు శక్తివంతమైన స్లోన్స్ బామ్ కూడ దొరకును.




వార్నర్ - లేంబర్ట్ ఫార్మస్యూటికల్ కంపెనీ (పరిమితమైన బాధ్యతతో యు. ఎస్. ఎ. లో స్థాపింపబడినది)




జె. బి. మంఘూరాంవారి

# ఎనర్జీ ఫుడ్

# బిస్కత్తులు

తొక్కుడుబండి నడపటానికి పిల్లలు ఎంత సరదాపడతారో—
జె. బి. ఎనర్జీ ఫుడ్ - బిస్కత్తులు తినడానికి అంత సరదాపడతారు. ఇవి జవము, జీవము, పుష్టినీ ఇచ్చును.

సౌఖ్యమైన సంసారములకు హితకరమైన బిస్కత్తులు

**జె. బి. మంఘూరాం అండ్ కంపెనీ,**
గ్వాలియర్ & హైదరాబాదు





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

చాలామంది పాఠకులు "చందమామ"కు కథలు పంపా లని ఉవ్విళ్లూరటంకూడా హర్షించదగిన సంగతే, అయితే కొందరు, "మేము ఫలాని పేరుగల కథ రాశాము, పంపితే వేసుకుంటారా?" అనీ, "ఎలాటి రచనలు పంపితే వేసు కుంటారు?" అనీ రాస్తారు. ఎలాటి కథలు మీకు నచ్చేదీ మీరెరుగుదురుగద. పేరు చెప్పినంతమాత్రాన కథ పాఠకుల కందరికీ నచ్చుతుందని చెప్పటానికి వీలుంటుందా?

మరొక్క చిన్న సంగతి మళ్లీ జ్ఞాపకం చేస్తాము— లేఖలూ, ప్రశ్నలూ, ఫొటో వ్యాఖ్యలూ ఒకే కార్డుపై చాలా మంది రాస్తున్నారు. అలాటి కార్డులు ఏదో ఒక కట్టలోకే చేరిపోతాయి. ఎందుకంటే లేఖలూ, ప్రశ్నలూ, వ్యాఖ్యలూ ఒకేసారి చూడము. అలా చెయ్యటంవల్ల మీ కార్డు మూడు ప్రయోజనాలకు బదులు ఏదో ఒక ప్రయోజనమే సాధి స్తుంది. అందుచేత వేరువేరు విషయాలు వేరు వేరు కార్డులపై రాయండి.

సంపుటి 29 : ఆగస్టు 1961 : సంచిక 2



# గంగాస్నాన ఫలం

ఒక ఊళ్ళో ఒక అమాయకుడైన బ్రాహ్మణ గృహస్థు ఉండేవాడు. ఆయన ఒకనాడు ప్రమాదవశాత్తూ ఏదో పాపకృత్యం చేశాడు. దానికి ప్రాయశ్చిత్త మేమిటని పెద్దల నడిగితే, గంగాతీరానికి వెళ్ళి, బతికి ఉన్నంతకాలమూ గంగాస్నానాలు చేస్తూ, దైవధ్యానం చేస్తూ ఉన్నట్టయితే పాపం పరిహార మవుతుందన్నారు.

అందుచేత బ్రాహ్మడు తన యావదాస్తి తన కొడుక్కు అప్పగించి తాను కర్రా బుర్రా తీసుకుని గంగను వెతుక్కుంటూ బయలుదేరాడు. వెళ్ళగా వెళ్ళగా ఆయనకు ఒక వాగు తగిలింది. ఆ వెర్రి బ్రాహ్మడు ఆ వాగును చూసి, అదే గంగ అనుకుని, భక్తితో అందులో స్నానాలుచేస్తూ, దాని ఒడ్డున కూచుని భగవధ్యానం చేసుకుంటూ అయిదేళ్ళు గడిపాడు. ఒకనాడు ఒక శివభక్తుడైన సన్యాసి అటుగా వెళుతూ బ్రాహ్మడితో, "నాయనా, ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.

దానికి బ్రాహ్మడు, "స్వామీ, నేను నేరక ఒక మహాపాపం చేసి, దాన్ని పోగొట్టుకునేటందుకు ఈ గంగాతీరాన దైవధ్యానం చేసుకుంటున్నాను," అని జవాబు చెప్పాడు.

"ఈ ముష్టివాగునా గంగ అంటున్నావు?" అని సన్యాసి అడిగాడు.

"స్వామీ, ఇది గంగానది కాదా?" అని బ్రాహ్మడు ప్రశ్నించాడు.

సన్యాసి పెద్దగా నవ్వి, "ఓయి వెర్రివాడా? గంగకూ ఈ వాగుకూ హస్తిమశకాంతరం కాదా? చెదల పుట్టను మేరు పర్వత మనుకుంటివే? నీవంటి అమాయకుడుంటాడని నేను కలలోకూడా అనుకోలేదు. నువ్వు వెళ్లదలుచుకున్న గంగానది ఇక్కడికి ఎన్నో వందల కోసుల దూరాన ఉన్నది," అని బ్రాహ్మడికి చెప్పాడు.

కె. నారాయణరావు





"స్వామీ, నాకు మహోపకారం చేసి ఎంతో పుణ్యం కట్టుకున్నారు," అంటూ బ్రాహ్మడు తన కర్రా, బుర్రా తీసుకుని వాగు ఒడ్డు నుంచి కదిలి, నడవగా నడవగా ఒక చిన్న నది తగిలింది. అది తప్పక గంగ అయి ఉంటుందని బ్రాహ్మడు ఎంతో సంతోషించి, అందులో స్నానాలు చేస్తూ, దాని ఒడ్డున కూచుని దైవధ్యానం చేసు కుంటూ మళ్ళీ అయిదు సంవత్సరాలు గడిపాడు. ఆ తరవాత ఒకనాడు అటుగా ఒక కాపాలికుడు వెళుతూ, బ్రాహ్మణ్ణి పలక రించి, "ఊరూ పేరూలేని ఈ నదీతీరాన తపస్సు చేస్తూ అయిదు సంవత్సరాలు గడిపావా? ఎంత వెర్రివాడివి? ఈపనే గంగాతీరాన చేసినట్టయితే నీకు అంతులేని పుణ్యం వచ్చి ఉండునే!" అన్నాడు.

బ్రాహ్మడు ఉలిక్కిపడి, "అదేమిటి, స్వామీ? ఇది గంగానది కాదా?" అని అడిగాడు.

"ఇదా గంగ? నక్క ఎక్కడైనా సింహ మవుతుందా? ఈ నదికీ గంగకూ సామ్యమే లేదు," అన్నాడు కాపాలికుడు.

"స్వామీ, తమరు ఇలా వేంచెయ్యటం ఎంతో మంచిదయింది. నాకీ సంగతి చెప్పి మీరెంతో పుణ్యం సంపాదించుకున్నారు," అంటూ బ్రాహ్మడు తన కర్రాబుర్రా తీసు కుని, ఆ నదీ తీరాన్నుంచి బయలుదేరి నడ వగా, నడవగా కొన్నాళ్లకు నర్మదానది వచ్చింది. "ఇది తప్పక గంగే!" అని రూఢి చేసుకుని, బ్రాహ్మడు రోజూ ఆ నర్మదలో స్నానాలుచేస్తూ, దాని ఒడ్డున కూచుని దైవధ్యానం చేస్తూ అక్కడే అయిదేళ్ల కాలం వుండి పోయాడు.

ఇలా ఉండగా ఒకనాడు ఒక యాత్రి కుడు అటుగావచ్చి, బ్రాహ్మడు కూచుని ఉన్నచోటనే నదిలో పూలు చల్లి, నదిని "నర్మదా!" అని సంబోధించి స్తవం చెయ్యసాగాడు.



బ్రాహ్మడు ఆ యాత్రికుణ్ణి సమీపించి, "అయ్యా, ఈ నది పేరేమిటి?" అని అను మానంతో అడిగాడు.

"ఇది మహాపవిత్రమైన నర్మదానది కాదటండీ? ఆ సంగతి మీకు నిజంగా తెలి యనే తెలియదా?" అని యాత్రికుడు బ్రాహ్మణ్ణి ఎదురు ప్రశ్నించాడు.

బ్రాహ్మడు దీర్ఘంగా నిట్టూర్చి, "అయ్యా, మీరు నాకు చాలా మేలుచేశారు!" అంటూ తన కర్రా బుర్రా తీసుకుని మళ్ళీ అక్కడి నుంచి కదిలాడు.

అయితే ఇప్పుడు బ్రాహ్మడి శక్తి యావత్తూ ఉడిగిపోయింది. ఇల్లు బయలుదేరి పది హేనేళ్ళయింది. వయసు మళ్ళిపోయింది. దానికితోడు తపస్సుతో ఆయన శరీరం కృశించింది. అందుచేత ఆయనకు ప్రయాణం అతికష్టమనిపించింది. పగలు ఎండబాధ హెచ్చుగా ఉంది. నీరసం చేత కాళ్ళు చురుకుగా కదలటంలేదు. అయినా ఆయన పట్టుదలతో పడుతూ లేస్తూ ప్రయాణంచేశాడు. చివరకు నడవలేని స్థితి వచ్చింది. అయినా ఆయన పాకుతూ, దేకుతూ ప్రయాణం సాగించాడు. తన శరీ రంలో ఊపిరి ఉన్నంతదాకా శరీరాన్ని ఈడ్చుకుంటూ వెళ్ళివెళ్ళి చిట్టచివరకు ఒక గుట్టమీది నుంచి గంగానదిని కళ్ళ చూశాడు. గంగలో స్నానాలుచేసే అసం ఖ్యాకులైన యాత్రికులను చూశాడు. బ్రాహ్మడి హృదయం ఆనందంతో నిండి పోయింది. ఆయన అక్కడే ప్రాణాలు వదిలాడు. యమదూతలు ఆయనను యమ ధర్మరాజు దగ్గిరికి తీసుకుపోయారు.

"ఈ మనిషి ఏమేం పాపాలు చేశాడు?" అని యముడు చిత్రగుప్తుణ్ణి అడిగాడు.

"ఒకే ఒక పాపకార్యం చేశాడు. కాని పదిహేనేళ్లు గంగాస్నానాలు చేసినందువల్ల ఆ పాపం పరిహారమయింది," అని చిత్ర గుప్తుడు చెప్పాడు.





# దక్షాధ్వర ధ్వంసము

ద్వితీయాశ్వాసము :

దక్షు డింటికి తామసమ్మున
త్రాచుపామై వచ్చె విసవిస ;
అతని పెండ్లము శివుని క్షేమము
అడిగినంతట బుస్సుమనియెను.

"బ్రహ్మయంతటివాని చేతను
ప్రస్తుతింపగబడిన నన్నొక
తపసి మాత్రునిగాగ నెంచుచు
తాను లేవడు, చేయి మోడ్చడు.

అష్ట దిక్పతులెల్ల నను గని
ఆదరమ్మున లేచి నిల్వగ
తా నదేదో దొంగ జపమున
తత్పరుండైనట్టు లుండును.

మునులు చేసెడి యజ్ఞములలో
తనకు స్థానం బున్నదనియెడు
గర్వమున పొరగప్పియుండిన
కనుల మూటిని తెఱపజేతును.

శివుని కించుక తా వొసంగక
చేయువలయును ఒక్క యజ్ఞము ;
అపుడు గానీ తెలియ దతనికి,
అహము అన్నది తగ్గ దతనికి."

అనుచు దక్షుడు కనలుచుండగ
అతని సతి కన్నీరు గార్చుచు,
పెదవి బిగువున దుఃఖ మాపుచు,
బదులు పలుకక లోని కేగెను.

తా నొకానొక దొడ్డ యజ్ఞము
తలపుచేసితి రండటంచును
దక్షు డపుడే దేవతలకును
తాపసులకును కబురు లంపెను.

పెద్ద యల్లుని శివుని పిలువక
పిన్న యల్లుర నెల్ల పిలిచెను ;
అల్లుడగు శివుపైని ఈసున
అనుగు కూతును పిలువడాయెను.

ఉత్పల సత్యనారాయణాచార్య



శివుని పిలువ కెవ్వండును
చేయడు ఏ యజ్ఞమ్మును ;
దక్షునకును పోగాలము
దాపురించె నేమో యని—

తలచి—మునులు దక్షు మాట
దాటలేక వచ్చినారు ;
అల్లుండ్రును కూతుండ్రును
పిల్లలతో వచ్చినారు.

ఐరావత మింద్రు డెక్కి
అరుదెంచెను తూర్పునుండి ;
నరవాహనుడై కుబేరు
డరుదెంచె ప్రతీచి నుండి.

దక్షిణ దిశ నుండి యముడు
తరలి వచ్చె దున్న నెక్కి ;
ఉత్తర దిశ నుండి మాత్ర
మొక్క పురుగు రాకుండెను !

నభమునుండి దేవ విమా
నములు భువికి దిగుచుండెను ;
పట్టపగలు చుక్కలు తెగి
పడుచుండిన లాగుండెను !

మొయిలుదారి కలకలమని
మ్రోగుచుండ, సతీ దేవి
కైలాసపు శిఖర మెక్కి
కనుగొన్నది దేవతలను.

దక్షయజ్ఞమునకు వారు
తరలి పోవు వార్తను విని,
వెండి కొండ మెట్లను సతి
వేడ్కతోడ తొరతొర దిగి.

చరచరమని అంతిపురికి
సరగున జని సతీదేవి,
చిఱునగవులతో మురియుచు
శివుని చెంత కూర్చుండెను.

"ఏమి విశేష"మ్మని శివు
డామెను ప్రశ్నించినాడు ;
సిగ్గున తల వంచి నగుచు
చెప్పె నిట్లు సతీదేవి.

"తమ మామగారైన
దక్ష ప్రజాపతులు
తా మొక్క యజ్ఞమును
తలపెట్టిరట, నాథ!

సఖులతో దేవతలు
చనుచుండినా రిపుడు;
మన మిద్దఱము గూడ
చనుట ఎప్పుడు, నాథ!"

ఈ రీతిగ పలికి ఆమె
ఓరగ పరికించె మగని;
పరమ శాంతితోడ శివుడు
పలికె నిట్లు ప్రియమారగ:

"ఇంత సంబర మేల పడేదవు?
ఎంత వెఱ్ఱివి నీవు, ప్రియసఖి!
నీదు జనకుడు మనల నవమా
నింప దలచుట నీ వెఱుంగవు!

మనల నిర్వుర పిలువకుండగ,
మఱియు నాకా యజ్ఞభాగము
ఏమియును లేకుండు నట్లుగ,
మామగా రొనరించు టెఱుగవు!

దక్షునికి ప్రియమైన
తనయ వైనప్పటికి
నీవు నా సతి వగుట
నిరసింపబడినావు.




తనకు చేతులెత్తి నేను
దండమిడగ లేదనియెడు
కోపముతో నీదు తండ్రి
శాప మిచ్చి వెలివేసెను.

సకల జీవు లందుండిన
సర్వేశ్వరు నెల్లప్పుడు
మనసులోనె కొల్చుట నా
మత మన్నది అతడెఱుగడు.

నను పరాభవింప దలచి
నిను గూడను పిలువడాయె;
అతని యజ్ఞమందు నాకు
హవిర్భాగ మొసగడాయె."

అనిన సతీదేవి యపుడు
వినయ మొప్ప ఇట్లు పలికె:
"చిన్నలమగు మ మ్మాయన
పిలువకున్న నేమి, నాథ!

పుట్టి నింటి వారు గూడ
బొట్టు పెట్టి పిలువ వలెన?
నా కోరిక మన్నించుము,
న న్నచటికి పంపించుము."

"పిలువని పేరంటమునకు
వెళ్ళిన తలవంపులగును;
పుట్టి నింట అవమానము
పొందుట చచ్చుటయ గాదె."

అని పలుకుచు పరమశివుడు
కనులు మోడ్చి "సరె పొ"మ్మనె;
కండ్ల నీళ్ళు తుడుచుకొనుచు
గడప దాటి ఆయమ చనె.

తనదు మేన సగమొసంగి
మనిచిన యా పరమేశుని
విడిచి పెట్టి దాక్షాయణి
వెడలె నపుడు పుట్టింటికి.

పరుగు పరుగున నందికేశుడు
అరుగుదెంచెను ఆమె వెంబడి;
నంది పయి సతి దీనురాలయి
కుందుచును గూర్చుండె నప్పుడు.

వెంట వచ్చిరి వేన వేలుగ
వీర వరులు త్రిశూల ధారులు;
వారి వెంటను ప్రమథగణములు
వచ్చి చేరెను వరద పెల్లుగ.

గంట గణగణ మ్రోగుచుండగ,
వెంట ప్రమథులు నడుచుచుండగ,
నందికేశుడు ఉమను మోయుచు
ముందు వడి వడి పోవుచుండెను.

—(సశేషం)






## 2

[బ్రహ్మపురమనే నగరానికి దాపున గల అరణ్యంలో కేశవుడనే కాపు యువకుడు వుండే వాడు. వాడు ఒక రోజున కొండవరిని పశువులను మేపుకుంటూండగా ఒక వింత జంతువు అక్కడికి వచ్చింది. అడవిలో వేటకు వచ్చిన బ్రహ్మపుర సేనాని దానిని చూసి, ఆశ్చర్యపడి తన భటులతో దాన్ని తన దగ్గిరకు తోలుకు రమ్మన్నాడు. తరవాత—]

సేనాని ఆజ్ఞ వింటూనే భటుల్లో ఒకడు తన గుర్రాన్ని దౌడుతీయించి, వింత జంతువును అదిలిస్తూ సేనాని వైపుకు తరుముకు వచ్చాడు. సేనాని దానికేసి ఓ నిమిష కాలం కళ్ళార్పకుండా చూసి, "ఇదేదో అపూర్వమైన జంతువు! ప్రపంచంలో యిలాటిది మరొకటి వుంటుందని నమ్మటానికి లేదు. రాజుగారికి దీన్ని బహూకరిస్తే ఎంతగానైనా సంతోషిస్తాడు," అంటూ కేశవుడికేసి తిరిగి, "ఏరా ఒరే! ఇలాంటి అపూర్వమైన జంతువును ఎక్కడ దొంగిలించావు? రాజ్యంలో దొరికే నిధినిక్షేపాలతో పాటు, ఇటువంటి అపూర్వమైన జంతువులూ, పక్షులూ— అన్నీ రాజుగారివే అన్న శాసనం సంగతి నీకు తెలియదా?" అంటూ ప్రశ్నించాడు.

సేనాని బెదిరింపులు వింటున్న కేశవుడికి ఎక్కడలేని కోపం వచ్చింది. కాని, దాన్ని అతడు బయటపడనీయకుండా, "అయ్యా, ఈ జంతువును నేనెక్కడా దొంగిలించ లేదు. ఆ కొండ మీద ఇంత



చిన్నపిల్లగా నాకు దొరికింది. పెంచి పెద్ద చేశాను. ఎప్పుడూ నా ఆలమందల వెంట తిరుగుతుంటుంది. నాకు చదువు సంధ్యలు రావు. పైగా ఎన్నడూ ఈ అరణ్యం వదిలి వెళ్లిన వాణ్ణికాను. అందువల్ల రాజుగారి శాసనం సంగతి నాకు తెలీదు," అన్నాడు.

"అలాగా, అయితే క్షమించాను. ఒరే, దాని మెడకు తాడువేసి నగరానికి తీసుకు రండి!" అంటూ సేనాని గుర్రాన్ని ముందుకు నడిపాడు. భటుల్లో ఒకడు ఉచ్చు బిగించివున్న పెద్ద తాడు నొకదాన్ని వింతజంతువు మెడకు పడేలా విసిరి, అది బిగుసుకోగానే, తాడు కొసను తను ఎక్కివున్న గుర్రం జీనుకు కట్టి, సేనాని వెనకగా బయలుదేరాడు. రెండవ భటుడు, కేశవుడి దగ్గిరకువచ్చి కత్తి ఝుళిపిస్తూ, "జాగర్త. నేను మళ్లీ ఓనెల రోజుల్లో ఒంటిగా యిక్కడికి వస్తాను. ఈసారి కొండమీద దొరికిన పిల్లను నా కప్పగించకపోయావో, ఒళ్లు చీరేస్తాను," అని హెచ్చరించి మొదటి భటుడి వెంట బయలుదేరాడు.

సేనానీ, అతడి వెంటవున్న భటులూ ప్రదర్శించిన నీచవర్తన కేశవుడి రక్తాన్ని ఉడికించింది. అతడు అంబుల పొదిలో నుంచి ఒక బాణం తీసి వాళ్లకేసి ఎక్కుపెట్టి, "ఛీ, ఎంత శత్రువునైనా వెనకనుంచి దొంగదెబ్బ తీయకూడదు," అనుకుంటూ బాణాన్ని కిందికి జారవిడిచాడు.

భటులిద్దరూ వింతజంతువును వెంట తీసుకుని వెనక వస్తూండగా, ముందుండి అరణ్యంలో దారితీస్తున్న బ్రహ్మపురం సేనాని ఆనందం అంతాయింతా కాదు. ఆ జంతువును మహారాజుకు చూపి, దాన్ని పట్టుకునేందుకు అరణ్యంలో తనెన్ని సాహసకృత్యాలు చేశాడో నమ్మబలికి, రాజు నుంచి పెద్ద బహుమానం సంపాయించాలని అతడు ఆలోచిస్తున్నాడు. ఒక కాపు యువకుణ్ణి బెదిరించి, ఆ వింతజంతువును





పట్టుకొచ్చినట్టు నగరంలో ఎవరికీ తెలియకూడదు. అందువల్ల తను ముందుగా తన భటులను హెచ్చరించాలి.

సేనాని యిలా అనుకుని, తన పథకం సంగతి భటులకు చెప్పేందుకు గుర్రాన్ని ఆపి వెనుతిరగబోయేంతలో హఠాత్తుగా అతడికి భటుడు వేసిన చావుకేక వినిపించింది. "అయ్యో, ఇదేదో రాక్షసిగుర్రం! నా గుర్రాన్ని డొక్కలో పొడిచి చంపేసింది. నా మీదకు..." అంటూ కెవ్వుమన్నాడు.

సేనాని తత్తరపడుతూ తల వెనక్కు తిప్పాడు. ఒక భటుడూ, వాడి గుర్రం రక్తం మడుగులో విలవిలా తన్నుకుంటున్నారు. రెండో భటుడు గుర్రాన్ని పక్కకు తిప్పి అరణ్యంలోకి ఉడాయిస్తున్నాడు. సేనాని నిలువెల్లా పణికిపోతూ, గుర్రాన్ని ముందుకు దూకించ బోయేంతలో వింత జంతువు ఒక్క ఎగురున ముందుకు వచ్చి, తన ఒంటి కొమ్ముతో దాన్ని గుండెల్లో పొడిచింది. గుర్రం పక్కకు ఒరిగిపోయింది. దాని మీదినుంచి కిందికి దూకబోయిన సేనానిని, అతడు నేలను తాకక ముందే వింతజంతువు వెన్నులో గట్టిగా పొడిచింది.

"రక్షించండి, రక్షించండి, రాక్షసి గుర్రం!" అని కేకలు పెడుతూ చావు తప్పించుకున్న భటుడు బ్రహ్మపురం చేరాడు. వాడు రాజవీధి వెంట ఇలాగే అరుస్తూపోవటం చూసిన జనులు, వాడికేదో పిచ్చెక్కిందనుకున్నారు. వాడు కోటద్వారం చేరి, అక్కడ కాపలా వున్న భటులను చూస్తూనే, "మన సేనాని చచ్చాడు, గుర్రం చచ్చింది. మన తోటివాడు చచ్చాడు, వాడి గుర్రమూ చచ్చింది. అందర్నీ ఆ రాక్షసి గుర్రం పీక్కు తింటున్నది!" అని మరింత బిగ్గరగా అరిచాడు.

కాపలా భటులు చేతుల్లో వున్న ఈటెలు అడ్డం పెట్టి గుర్రాన్ని ఆపి, వాణ్ణి బలవంతంగా దాని మీదినుంచి కిందికి దించారు.







వాడు కిందికి దిగి యింకా కేకలు పెడు తూనే వున్నాడు. కాపలావాళ్లలో ఒకడు వాడి గుండెలమీద ఈటె ఆనించి, "ఇంక అరిచావే, పొడిచేస్తాను, జాగర్త! సేనా నాయకుడెక్కడ?" అని గద్దించి అడిగాడు.

"ఇంకెక్కడి సేనానాయకుడు! అరణ్యంలో ఆయన్నీ, మన భటుల్నీ ఒంటి కొమ్ము రాక్షసిగుర్రం తినేసింది. నేను ప్రాణాలతో పారిపోయివచ్చాను," అన్నాడు భటుడు ఆయాసపడుతూ.

అంతలో అక్కడికి కాపలావాళ్ల నాయకుడు వచ్చాడు. అతడికి భటుడి వాలకం చూడగానే, వాడికి పిచ్చెత్తిందన్న నమ్మకం కలిగింది. కానీ, వాడు ఉదయం సేనా నాయకుడితో కలిసి అడవికి వేటకు వెళ్లాడన్న సంగతి అతడికి గుర్తొచ్చింది.

"పిచ్చిగా కేకలు పెట్టకుండా, నిజంగా జరిగిందేమిటో చెప్పు. మహా సేనాని ఇంకా అడివిలోనే వున్నాడా?" అని అడిగాడు కాపలావాళ్ల నాయకుడు.

"అది రాక్షసిగుర్రం! సేనానాయకుణ్ణి బొమికకూడా మిగల్చకుండా తినేసి వుంటుంది!" అన్నాడు భటుడు.

ఆ జవాబు వింటూనే కాపలావాళ్ల నాయకుడు పక్కన వున్న వాడి దగ్గిర్నుంచి ఈటె లాక్కుని, భటుణ్ణి పొడిచేందుకు పైకెత్తాడు. భటుడు ప్రాణభయంతో కంపించిపోతూ, "చంపేస్తున్నాడు, రక్షించండి!" అంటూ గావు కేకపెట్టాడు.

ఆ కేక వింటూనే రాజభవనం రెండో అంతస్తులోని గది నుంచి మంత్రి బయటికి వచ్చి, "ఎవర్రా, ఆ కేకలు పెట్టేది?" అని కోపంగా ప్రశ్నించాడు.

"అయ్యా, వీడికి మతి చెడింది. సేనా నాయకుణ్ణి అడివిలో ఒంటికొమ్ము రాక్షసి గుర్రం చంపి తిన్నదని కేకలు పెడుతున్నాడు," అన్నాడు కాపలావాళ్ల నాయకుడు.





"అలాగా! వాణ్ణి నా దగ్గిరకు పంపండి!" అంటూ మంత్రి గదిలోకి వెళ్ళిపోయాడు.

భటుడు గది వాకిలిని సమీపించగానె మంత్రి నవ్వుతూ అతడికేసి చేయిఊపి, "భయపడకుండా జరిగిందేమిటో వివరంగా చెప్పు," అన్నాడు.

భటుడు కాస్త స్థిమితపడి, అరణ్యంలో కాపుయువకుడు కేశవుడు కనబడటం దగ్గిర నుంచి, సేనాని ఆ వింతజంతువును అపహరించి బయలుదేరటం, ఆ తరవాత దారిలో అది ముందు భటుణ్ణీ, తరవాత సేనానినీ చంపటం, తను పారిపోయిరావటం...అంతా వివరంగా చెప్పాడు.



మంత్రి ఒక్షణకాలం ఆలోచిస్తూ ఊరుకుని, "అయితే, ఆ యిద్దర్నీ వింతజంతువు చంపుతూండగా నువ్వు చేతులు కట్టుకుని దూరంగా నిలబడ్డావన్నమాట! నీకు ప్రాణభయం కలగలేదా?" అని అడిగాడు.

"ప్రాణభయమా! నా పై ప్రాణాలు పైనే పోయినై. నా తోటి భటుణ్ణి చంపేందుకు ఆ వింతజంతువు ఎగరగానే నేను అరణ్యానికి అడ్డం పడి పారిపోయి వచ్చాను," అన్నాడు భటుడు.

"అయితే, సేనాని చావటం నువ్వు చూడలేదన్నమాట!" అన్నాడు మంత్రి.

"అయ్యా, కంటితో చూడకపోతేనేం? 'చచ్చాను, రక్షించండి' అంటూ మహాసేనాని గావుకేకలు పెట్టటం నాకు వినిపించింది," అన్నాడు భటుడు.

భటుడి జవాబుకు మంత్రి నవ్వి, "అదివిలో నువ్వేదో పిచ్చిపుచ్చకాయ తిన్నట్టుంది. నిజంగా సేనాని మరణించివుంటే, దానికి కారణం నువ్వు చెప్పినట్టు వింత జంతువుకాదు. అలాంటి జంతువు లోకంలో ఎక్కడా వుండదు. ఆ కాపు యువకుడు కేశవుడన్నావే...వాడు విలువిద్య నేర్చిన వాడు గదా? సరే, భటుల్ని కొందరిని అరణ్యానికి పంపి జరిగిందేమిటో తెలుసు





కుంటాను. దారి చూపవలసిన వాడివి నువ్వు!" అన్నాడు.

"అయ్యో, చిత్తం, చిత్తం!" అంటూ భటుడు తల వూపాడు. కాని, వాడికి అరణ్యం పేరు చెపితేనే గుండెదడ పుట్టుకొస్తున్నది. అయినా, మంత్రి ఆజ్ఞను ధిక్కరించేందుకు లేదు.

మంత్రి కోటద్వారం కాపలావాళ్ల నాయకుణ్ణి పిలిచి, అడవిలో సేనాని కోసం వెదకవలసిందిగా ఆజ్ఞ యిచ్చాడు.

ఈలోగా నగరంలో సేనాని దుర్మరణాన్ని గురించి రకరకాల వార్తలూ ప్రచారం కాసాగినై. రాజవీధి వెంటవస్తూ భటుడు పెట్టిన గావుకేకలు చాలామంది ప్రజలు వినివున్నారు. ఏదో అపూర్వమైన వింతజంతువు...ముఖాన ఒంటికొమ్ము... పెద్దపెద్ద రెక్కలూ గలది...అరణ్యానికి వేటకు వెళ్లిన సేనానిని పట్టుకుని ఆకాశానికి ఎత్తుకుపోయిందనికూడా నీలివార్తలు బయలుదేరినై.




పాలమ్మటానికి నగరానికి వచ్చిన కేశవుడి తండ్రి ఈ పుకార్లన్నీ విన్నాడు. అతడికి రాత్రి తన కొడుకు చెప్పిన వింత జంతువు సంగతి గుర్తు కొచ్చింది. సేనాని అంత వాణ్ణి చంపిన ఆ క్రూరజంతువు, తన కొడుకును మాత్రం ప్రాణాలు తీయకుండా వదులుతుందా?

ముసలివాడి మనసు యిలాంటి అనుమానాలతో చీకాకైపోయింది. అతడు నగరాన్నించి హడావిడిగా తన ఇంటికి బయలుదేరాడు. సరిగా అతడు నగరద్వారం దాటుతూండగా మరీ ఆశ్చర్యకరమైన పుకారు వినవచ్చింది: అరణ్యంలో ఆలమందలు కాచుకు బతుకుతున్నట్టు నటిస్తున్న, ఒక శత్రుదేశపు గూఢచారి, సేనానాయకుణ్ణీ, అతడి వెంటవున్న భటుణ్ణీ చంపివేశాడట! అతణ్ణి వీలైతే ప్రాణాలతో పట్టుకురావలసిందిగా మంత్రి భటుల్ని పంపుతున్నాడు.



ఈ వార్త విన్నమీదట ముసలివాడికి నిజంగానే తన కొడుకు ప్రాణానికి ముప్పు వాటిల్లనున్నదని భయం కలిగింది. ఈపరికే అతణ్ణి వింతజంతువు చంపివుండకపోతే, ఇంగితజ్ఞానంకూడాలేని మంత్రి పంపిన భటులు అతణ్ణి గూఢచారిగా భావించి తప్పక చంపుతారు. తను ముందుగా వెళ్లి అక్కడి పరిస్థితి ఎలావుందో చూసి, తన కొడుకును హెచ్చరించాలి.

ముసలివాడు ఆగమేగాలమీద అరణ్యం లోని తన పూరిపాక చేరాడు. అక్కడ ఎవరూ లేరు. ఎందుకైనా మంచిదని ఎంతో కాలంగా గోడకు తగిలించి వున్న తన తండ్రి కాలంనాటి కత్తిని తీసుకుని, తన కొడుకు ఆలమందను మేపే కొండ ప్రాంతానికి బయలుదేరాడు.

కేశవుడు మామూలుగా రోజూ కూచునే చెట్టు కింద కనిపించే సరికి ముసలివాడికి ప్రాణంలేచి వచ్చినట్టయింది. అతడు పరిగెత్తుతూ కొడుకును సమీపించి, "కేశవా! నిన్ను ప్రాణాలతో చూడగలుగుతాననుకో లేదురా, బాబూ! నగరంలో చాలా చాలా పుకార్లు బయలుదేరినై. అసలు నిజంగా యిక్కడ జరిగిన సంగతేమిటి?" అని ఆదుర్దాగా అడిగాడు.

తండ్రి ఆదుర్దా, అతడి చేతిలోని కత్తీ కేశవుణ్ణి చాలా ఆశ్చర్యపరిచినై. నగరంలో బయలుదేరిన పుకార్లేమిటో అతడికి అర్థం కాలేదు. అతడు తండ్రికేసి నిశ్చలంగా చూస్తూ, "కత్తి తెచ్చావెందుకు? పుకార్లేమిటి?" అని ప్రశ్నించాడు.

"బ్రహ్మపురం సేనానాయకుణ్ణీ, అతడి వెంట వున్న భటుణ్ణీ, ఒక వింతజంతువేదో అరణ్యంలో చంపిందని నగరంలో పుకారుగా వుంది. మారువేషంలో వున్న శత్రుదేశపు గూఢచారి అతణ్ణి చంపాడని మరికొందరు చెప్పుకుంటున్నారు," అన్నాడు తండ్రి.

—(ఇంకా వుంది)





# జవాబులేని ప్రశ్న

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కొందరికి శక్తిసామర్థ్యాలు ప్రతిబంధక మవుతాయి. అందుకు నీవే కదా తార్కాణం! నే నడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పటంవల్ల నీకు కార్యభంగ మవుతున్నదే గాని ఏ విధంగానూ లాభించటంలేదు. నీలాగే నాగరాజ కుమార్తె కూడా అన్ని ప్రశ్నలకూ సమాధానాలు చెప్పగలిగి ఉండేది. అయితే అందువల్ల ఆమె జయించింది. ఈ అపరాత్రివేళ నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతిచిత్రమైన అనంగరాగ కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు.

పూర్వం సూర్యకాంతుడనే రాజుండేవాడు. అయన తన బలపరాక్రమాలతో నాలుగు సముద్రాల మధ్యగల భూమినంతా

## బేతాళ కథలు



జయించాడు. తన బుద్ధి బలంతో ,సకల శాస్త్రాలనూ సాధించాడు. మన్మధుణ్ణి మించే తన సౌందర్యంతో తన రాజ్యంలో గల స్త్రీలందరి మనసులనూ హరించాడు. కాని ఆయన మనసును చలింపజేయు గల స్త్రీ ఎక్కడా లేకపోయింది.

తమ రాజుగారు ఏ స్త్రీనికూడా కన్నెత్తి అయినా చూడకపోవటమూ, పెళ్ళి చేసుకునే ఆలోచన ఆయనకు ఏ కోశానా లేకపోవటమూ చూసి ఆయన మంత్రులు ఆందోళన చెందారు. రాజుగారు పెళ్లాడి పిల్లలను కనకపోతే ఆయన అనంతరం సింహాసనం ఏంకాను?



మంత్రులు తమలో తాము కూడబలుక్కుని, ఎలాగైనా రాజుగారి బుద్ధి పెళ్ళి మీదికి పోయేలాగ చేయాలని తీర్మానించుకున్నారు. ఇందుకుగాను వారు రాజ్యంలో మూలమూలల ఉండే అందగత్తెలైన కన్యలందరినీ పట్టుకువచ్చి, ఏదో సాకుతో రాజుగారి కళ్ళబడేటట్టు చేశారు.

కాని అందువల్ల అవంతైనా ప్రయోజనం లేకపోయింది. ఎంతలేసి సౌందర్యవతులను చూసినా సూర్యకాంత మహారాజు మనసు మారనేలేదు. అది చూసి మంత్రులు మరింత ఆందోళనపడి, రాజుగారి దగ్గిరికి సమిష్టిగా వెళ్ళి, "మహారాజా, తమరు తగిన కన్యను చూసి వివాహమాడి మగ సంతానాన్ని కనకపోతే దేశానికి భవిష్యత్తులేదు. అంతా అరాజకమైపోతుంది," అని మొరపెట్టుకున్నారు. రాజుగారు వారి కోరికను పాటించలేదు.

ఏమి చెయ్యటానికీ పాలుబోక మంత్రులు, రాజుకు తెలియకుండా, ఒక పుకారు వేశారు. అదేమి టంటే, రాజుగారిని ఏ విధంగానైనా సరే పెళ్ళికి ఒప్పించ గలిగిన వారికి కోటి బంగారుమాడ లిస్తామని. ఈ పుకారు విని కొందరు దుష్టవైద్యులు మందులూ, మాకులూ, తాయెత్తులూ మొద



లైనవి తీసుకుని ఆశతో వచ్చారు. అయితే వారి ప్రయత్నాలు వృథా కావటమేగాక, రాజుకు ఆడవాళ్ళంటే నానాటికీ మరింత ద్వేషం ఏర్పడింది. చివర కాయన తన కంటబడిన ఆడవాళ్ళకు దేశ బహిష్కార శిక్ష విధిస్తానని కఠినమైన శాసనం కూడా చేశాడు. దీనితో మంత్రుల ఆశలన్నీ ఇంకిపోయాయి.

ఈ స్థితిలో ఒక చిత్రకారుడు ఎక్కడి నుంచో వస్తూ సూర్యకాంత మహారాజు పాలించే నగరం చేరుకున్నాడు. అతను ఆ నగరపు ప్రజలను, "మీ ఊరి విశేషాలేమిటి?" అని అడిగితే, వారు, "ఒకటే విశేషం. మా రాజుగారు ఆడదాని పొడ సహించడు. పెళ్లాడడు. ఆయనకు పెళ్ళి చెయ్యటం ఎలాగా అని మంత్రులు మథన పడిపోతున్నారు," అని చెప్పారు.

ఈ మాటలు విని చిత్రకారుడు పెద్దగా నవ్వి, "మీ రాజుగారి మనసును నేనైతే క్షణంలో మార్చగలుగుదునే!" అన్నాడు.

ఈ మాటలు మంత్రులు నియోగించిన వేగులవాళ్ళ చెవులపడ్డాయి. వారు పెళ్ళి మంత్రులతో చెప్పారు. మంత్రులు చిత్రకారుణ్ణి పిలిపించి, సంగతి అంతా చెప్పి, రాజుగారి మనసు మార్చినట్టయితే కోటి



బంగారు మాడలూ తప్పక ఇస్తామని అతడికి వాగ్దానం చేశారు.

"రాజుగారు నన్ను పిలిపించేటట్టు చెయ్యండి. ఆ పైసంగతి యావత్తూ నేను చూస్తాను," అన్నాడు చిత్రకారుడు.

మంత్రులు రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, మన నగరానికి ఒక గొప్ప చిత్రకారుడు వచ్చాడు. అతనికి ముల్లోకాలలోనూ సాటిలేరని తెలుస్తున్నది," అన్నారు.

అన్ని కళలలోనూ ఆరితేరిన సూర్యకాంత మహారాజు ఆ మాట విని సంతోషించి, "అయితే అతణ్ణి పిలిపించి నా దగ్గిరికి పంపండి!" అన్నాడు.

త్వరలోనే చిత్రకారుడు రాజువద్దకు వచ్చాడు. అతడు రాజు చక్కదనం చూసి నివ్వెరపోయి, "మహారాజా, మీ చక్కదనం చూసి నా జన్మ తరించింది. మిమ్మల్ని చిత్రించటానికి అనుమతి ఇవ్వండి. మీ రూపం ఎప్పటికీ నా దగ్గిర ఉంచుకుంటాను," అన్నాడు.

"ముందు నేను నీ పనితనం చూడాలి. నీ వద్ద ఉండే బొమ్మలు చూపించు. స్త్రీల పటాలు మాత్రం చూపకు సుమా. అలా చేస్తే నేను నిన్ను క్షమించను," అన్నాడు రాజు. చిత్రకారుడు నానాదేశాలలో తాను తయారుచేసిన చిత్రాలను రాజుగారి ముందుపెట్టాడు. అతను వాటి మధ్యను బుద్ధిపూర్వకంగానే ఒక స్త్రీ చిత్తరువు కూడా పెట్టాడు.

రాజు ఒక్కొక్క బొమ్మనే చూస్తూ ఉండగా అకస్మాత్తుగా ఆ ఆడదాని బొమ్మ కంటపడింది. దాన్ని చూస్తూనే రాజు తెలివి తప్పి పడిపోయాడు.

చిత్రకారుడు చిరునవ్వు నవ్వి మంత్రులతో, "రాజుగారికి మీరు కోరిన చికిత్స చేసేశాను. నా బహుమానం నా కిప్పించండి," అన్నాడు.

"చికిత్స పూర్తి అయిందో లేదో తెలుసుకోని!" అన్నారు మంత్రులు.



"స్పృహ తెలియగానే రాజుగారు ఏమంటారో వింటే మీ అనుమానం దానంతట అదే తీరిపోతుంది. కొంచెం ఓపికపడితే చాలు," అన్నాడు చిత్రకారుడు.

అతను బయటికి వెళ్ళిపోయాక మంత్రులు రాజుకు శైత్యోపచారాలు చేశారు. స్పృహ వస్తూనే రాజు, "ఏడీ, ఆ చిత్రకారుడు?" అని అడిగాడు.

"అతను వెళ్ళిపోయాడు, మహాప్రభూ," అన్నారు మంత్రులు.

"సాయంకాలం లోపుగా అతన్ని తీసుకురాకపోయారో మిమ్మల్ని ఏనుగుల చేత తొక్కిస్తాను," అన్నాడు రాజు.

మంత్రులు వెళ్ళి చిత్రకారుణ్ణి వెతికి తెచ్చి రాజు ఎదట పెట్టారు.

రాజు అతనితో, "నీ వంటి ప్రతిభావంతుడు ప్రపంచంలో ఉండబోడు. ఆ బొమ్మను నాకు చూపి ఎంతో పుణ్యం కట్టుకున్నావు. ఆమె ఏ జన్మలోనో నాకు భార్య అయి ఉండాలి. లేకపోతే ఆమె ఇంత సులువుగా మనసును హరించదు. చెప్పు—ఆమె ఎవరు? పేరేమిటి? ఏ దేశంలో ఉంటుంది? ఆమెను నేనెలా పెళ్ళాడగలను?" అన్నాడు.

చిత్రకారుడు రాజుతో, "మహారాజా, మీ రామెను మరిచిపోవటం మంచిది.






ఆమె మీకు దక్కదు. ఆమె నాగరాజు కూతురు, అనంగరాగ. ఆమె అరణ్యం మధ్య ఒంటరిగా భవనం నిర్మించుకుని అందులో ఉంటున్నది. ఆమెను పెళ్ళాడాలని అసంఖ్యాకులు ప్రయత్నించేసి ఓడిపోయారు. ఎందుచేతనంటే తనను కోరి వచ్చినవారికి ఆమె మూడు వారాలు వ్యవధి ఇస్తుంది. ఈ లోపుగా వారు ఆమెను రోజు కొక ప్రశ్న వేయవచ్చు. ఆ ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోయినట్టయితే ఆమె ప్రశ్న వేసినవాణ్ణి పెళ్ళాడుతుంది. ఆమెను ఓడించలేకపోయినవాడు మూడు వారాల అనంతరం ఆమెకు బానిస అయిపోవాలి. నా మాట నమ్మండి—ఆమెను ఎవరూ ఓడించలేరు," అన్నాడు.

"వెర్రివాడా, ఆమెను చూసినదాకా నా ప్రాణాలు నిలవవు. ఆమెను ఓడించానా నా భార్యను చేసుకుంటాను. లేదా, ఆమెకు బతికి ఉన్నంతకాలమూ నిశ్చింతగా బానిసనై ఉంటాను," అన్నాడు సూర్యకాంత మహారాజు.

ఆయన అనంగరాగ ఉండే చోటికి దారి తెలుసుకుని అప్పటికప్పుడే ప్రయాణమయాడు. ఈ సంగతి తెలిసి మహారాజు ఆప్తమిత్రుడైన వినోదు డనేవాడు కూడా వెంట బయలుదేరాడు.

"మహారాజా, ఆమె బొమ్మను చూసేసరికే మీ మతి సగం పోయింది. ఆమెను చూశాక అది పూర్తిగా పోతుంది. ఆ స్థితిలో మీ రామెను ఓడించలేరు. అప్పుడు నా బుద్ధి మీకు అరువిస్తాను," అన్నాడు వినోదుడు.

రాజు అతని సలహా ఆమోదించి, అతన్ని వెంటబెట్టుకుని అనంగరాగ ఉండే చోటికి వెళ్ళాడు. ఆమెను ప్రత్యక్షంగా చూసిన మీదట వినోదు డన్నట్టు రాజుకు నిజంగానే మతి సాంతం పోయింది.

వినోదుడు అసంగరాగతో తాము వచ్చిన పని చెప్పాడు. ఆమె వారికి చెయ్యవలసిన



మర్యాదలుచేసి, తన నియమం వారికి చెప్పి, "ప్రతి ఉదయమూ నేను వచ్చి మీ రడిగే ప్రశ్నకు సమాధానం చెబుతాను. మూడు వారాలపాటు మీరు నాకు అతిథులు. ఈలోపుగా మీరు నన్ను గెలుచుకుంటే సరే, లేకపోతే ఆ తరవాత మీరు నాకు బానిస లవుతారు," అని తెలియజేసి ఠీవిగా వెళ్ళిపోయింది.

అది మొదలు ప్రతి ఉదయమూ అనంగ రాగ వారి వద్దకు వచ్చేది. వినోదుడు ఆమె కొక కథ చెప్పి, ఆ కథను గురించి ఒక ప్రశ్న వేసేవాడు.




ఆ ప్రశ్నకు అనంగరాగ సమాధానం చెప్పి వెళ్ళిపోయేది.

ఈ విధంగా పంథొమ్మిది రోజులు గడిచాయి. వినోదుడు ఆమెను ఓడించలేక పోయాడు. ఇక సూర్యకాంతుడు ఆమెను చూసి ఆనందించటం తప్ప, కథలుగాని, వినోదుడి ప్రశ్నలుగాని, వాటికి ఆమె ఇచ్చే సమాధానాలుగాని పట్టించుకోలేదు.

అతనికి అనంగరాగలో ఒక మార్పు కనిపించింది. మొదటి రోజు ఆమె తనకేసి చూడనైనా లేదు. రెండో రోజు ఆమె వెళ్ళి పోబోతూ రాజు కేసి ఒకసారి చూసింది. అది మొదలు ఆమె రాజు మీదనే కళ్ళుంచటమూ, మధ్య మధ్య నిట్టూర్చటమూ మొదలైన చేష్టలు చెయ్యసాగింది.

"నేను ఆమె హృదయాన్ని ఎలాగో జయించాను గాని, వినోదుడు ఆమె బుద్ధిని జయించలేకుండా ఉన్నాడు," అనుకున్నాడు రాజు. సరిగా ఆ సమయంలో ఆయన కొక అద్భుతమైన ప్రశ్న స్ఫురించింది. ఆయన చివాలున లేచి తన మిత్రుడితో, "మిత్రమా, పంథొమ్మిది రోజులుగా నీవు అనంగరాగను ఓడించలేకుండా ఉన్నావు. రేపు నేనే ఆమెను ప్రశ్నిస్తాను. ఆ ప్రశ్నకు ఆమె సమాధానం చెప్పలేక పోతే రేపే ఓడి పోతుంది. సమాధానం



చెప్పిందా ఎల్లుండి తప్పక ఓడుతుంది. మనకు ఎలాగూ ఎల్లుండిదాకా గడువున్న దిగద!" అన్నాడు.

మర్నాడు ఉదయం అనంగరాగ రాగానే సూర్యకాంత మహారాజు ఆమెను ఒక ప్రశ్న వేశాడు. ఆ ప్రశ్న వినగానే అనంగ రాగ ఆయనను ఆలింగనం చేసుకుని, "ఈ ప్రశ్న ఇంతకాలం ఎందుకువేశారు కారు? మీరు నన్ను గెలపరేమో అని నా ప్రాణం తహతహ లాడిపోయింది గద!" అన్నది.

రాజు నిర్ఘాంతపోయి, "నీకు నిజంగా అంత ఓడిపోవాలని ఉంటే మా ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా మానక పోయావా?" అన్నాడు.

"మహారాజా, స్త్రీ హృదయం మీ రెర గరు. అది తాను ప్రేమించిన వ్యక్తినే పీడించి ఆనందిస్తుంది," అన్నది అనంగరాగ. తరవాత ఆమెను వివాహమాడి రాజు తన నగరానికి తిరిగి వెళ్ళి సుఖంగా కాపరం చేశాడు. మంత్రులందరూ తమ రాజు యిన్నాళ్ళకు ఒక ఇంటి వాడై నందుకు పరమానందం చెందారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రాజు ఆమెను ఏ ప్రశ్నతో ఓడించాడు? తెలిసి కూడా సమాధానం చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అదేమంత కష్టమైన ప్రశ్న కాదు. 'నిన్ను నేను ఏ ప్రశ్న వేస్తే నీవు సమాధానం చెప్పలేకపోతావు?' అని రాజు అనంగరాగను అడిగి ఉండాలి. సమాధానం చెప్పదా, ఓడిపోతుంది. సమాధానం చెప్పిందా, ఆమె చెప్పిన ప్రశ్ననే మర్నాడు రాజు ఆమెను వేస్తాడు. అప్పుడు నమ్మకంగా ఓడిపోతుంది," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# చచ్చిబతికిన సన్యాసి

మర్నాడు బామ్మ గుండు భీమన్నతో, "ఒరే, నాయనా, నిన్న నీకు పని యిచ్చినవాడు చాలా చెడ్డవాడు. అటువంటివాళ్ళ దగ్గిరికి పోకు. ఎవరన్నా ముసలి సాధువులకు సేవ చేస్తే భుక్తి, ముక్తీ ఉంటుంది. వాళ్ళ సంపర్కంవల్ల నీకింత జ్ఞానంకూడా కలుగుతుంది," అన్నది.

భీమన్న ఇల్లు కదిలి ముసలి సాధువు ఎవరన్నా కనిపిస్తాడా అని వెతుక్కుంటూ బయలుదేరాడు. ఒకచోట వాడికి ఒక గుడ్డి బిచ్చగాడూ, వాణ్ణి నడిపించే కుర్రాడూ కనిపించారు. బిచ్చగాడి కుర్రాడు భీమన్నను పలకరించి వాడి ఉద్దేశం తెలుసుకుని, "ఈ గుడ్డిమనిషి గొప్ప సాధువు. నే నింతకాలమూ ఈయనకు సేవచేసి ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. కావలిస్తే నా బదులు నీవే ఈయనకు సేవ చెయ్యవచ్చు. నేను ఎక్కడికైనా పోయి మరొక పని చూసుకుంటాను," అన్నాడు. గుండు భీమన్న సంతోషించి, సరేనన్నాడు. బిచ్చగాడి శిష్యుడు భీమన్నను బిచ్చగాడికి వప్పగించి, "ఇక నుంచీ వీణ్ణి శిష్యుడుగా పెట్టుకో. నేను పోతున్నాను," అని చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

బిచ్చగాడు భీమన్నకు వాడి విధులన్నీ వివరంగా చెప్పాడు :

"మనం ఇంటింటికీ వెళ్ళి అడుక్కుంటాము. నాకు కళ్ళు కనపడవు గనక నన్ను నువు కర్ర పట్టుకు నడిపించాలి. నువు వెనక తిరిగి చూడనవసరం లేదు. మెరకగాని, పల్లంగాని, నీళ్ళుగాని వచ్చినప్పుడు నాకు చెబితే చాలు. ఇళ్ళన్నీ అడుక్కున్నాక మనం వంటచేసుకు తినాలి. వంట నువే చెయ్యాలి. మళ్ళీ బయలుదేరేటప్పుడు మన సామానంతా సరిగా ఉన్నదీ లేనిదీ నువే చూసుకోవాలి. మన సామాను ఏమిటో





ఇద్దరూ నడుస్తూండేటప్పుడు భీమన్న మధ్య మధ్య ఆగి బిచ్చగాణ్ణి గమనిస్తూ వచ్చాడు. బిచ్చగాడు వాడితో, "నువు నా కోసం ఆగవలిసిన పనే లేదు. నీ మానాన నువు ముందు పోతూ ఉండు. ఎక్కడైనా ఎత్తుగాని, పల్లంగాని, నీళ్ళుగాని వస్తే నాకు చెప్పు," అన్నాడు.

భీమన్న అట్లాగే ముందు చూస్తూ నడవ సాగాడు. కొంత దూరం వెళ్ళేసరికి ఒక ఏరు అడ్డం వచ్చింది.

భీమన్న వెనక్కు తిరిగి చూడకుండానే, "నీళ్ళు, గురూ!" అన్నాడు.

"ఎవరన్నా దాటుతున్నారా?" అని బిచ్చగాడు ప్రశ్నించాడు.

ఏటికి అడ్డంగా వస్తున్న ఆవులను చూసి, "ఆవులు దాటుతున్నాయి, గురూ!" అన్నాడు భీమన్న.

"సరే, మనమూ దాటుదాం," అన్నాడు బిచ్చగాడు.

భీమన్న ఏటిలోకి దిగి కొంత దూరం వెళ్ళి, "రాయి, గురూ," అంటూ నీటిలో పడిపోయాడు. ఆ పాటుకు వాడు కొంకుల కఱ్ఱను గుంజటంలో బిచ్చగాడు కూడా పడిపోయాడు. వాడి జోలె మాత్రం కొంకికి చిక్కుకున్నది. జోలెలోకి కొన్ని చేపలూ,

తెలుసా? బుట్టా, తట్టా, తప్పేలా, చెంబూ, లోటా, గరిటే, కఱ్ఱా—అంతే! ఈ జాబితా బాగా కంఠస్థం చేసుకో. నేను చెప్పిన ప్రకారం సేవచేశావంటే మనకు దొరికిన దాన్లో నీకు సగం, నాకు సగం. తెలిసిందా?"

భీమన్న ఎంతో శ్రద్ధగా బిచ్చగాడు చెప్పినదంతా తల కెక్కించుకున్నాడు. సన్యాసి వద్ద ఒక కఱ్ఱ ఉన్నది. దానికి రెండు చివరలా కొంకులున్నాయి. బిచ్చగాడు జోలె భుజాన వేసుకుని కఱ్ఱ ఒక చివర పట్టుకు నడుస్తుంటే, తట్ట నెత్తిన పెట్టుకుని భీమన్న కఱ్ఱ రెండో చివర పట్టుకుని దారితీశాడు.



ఒక పాముా జొరబడ్డాయి. బిచ్చగాడు ప్రవాహంలో పడి కొట్టుకుపోయాడు.

భీమన్న లేచి తట్ట నీటిలో నుంచి పైకి తీసి, "తట్టా, బుట్టా, తప్పేలా, చెంబూ, లోటా, గరిటే, కర్రా—అంతే!" అని అన్నీ లెక్క చూసుకుని, బిచ్చగాడి కోసం వెనక్కు తిరిగి చూడక, కర్రచివరి కొంకికి చిక్కుకున్న జోలెను ఈడ్చుకుంటూ ఏరు దాటసాగాడు.

దురదృష్టవశాత్తూ జోలెలో చేరిన పాము తల బయటికి పెట్టేసరికి దాని తల కర్ర కొంకెకీ జోలెకీ మధ్య నొక్కుకుపోయి అది కాస్తా చచ్చింది.

భీమన్న నదీ దాటి జోలెను ఈడ్చుకుంటూ పోతుంటే దారిలో కొందరు, "అయ్యో, పాము, పాము!" అని పెద్దగా కేకలు పెట్టారు.

"పాము కాదు, స్వాములవారు," అని భీమన్న వారికి బదులు చెప్పాడు.

"పామో, స్వామో—వెనక్కు తిరిగి చూడు, నీకే తెలుస్తుంది," అన్నారు వాళ్ళు.

"చూడను, చూడకూడదు! స్వాముల వారి ఆజ్ఞ!" అన్నాడు భీమన్న. వాడి చుట్టూ ఒక గుంపు చేరింది. వాడు కొంచెం ముందుకు పోయి ఒక ఇంటిముందు నిలిచి, "గురూ!" అన్నాడు.



వాడు "గురూ!" అనగానే బిచ్చగాడు, "జై సీతారాం!" అంటాడు. ఇంటివాళ్ళు బిచ్చం వేస్తే వేస్తారు, లేకపోతే పొమ్మంటారు.

ఈ ఏర్పాటు ప్రకారం భీమన్న, "గురూ!" అన్నాడు. కాని బిచ్చగాడు, "జై సీతారాం!" అనలేదు. అప్పుడు వాడు కర్ర రెండో చివరకేసి చూశాడు. వాడికి చచ్చిన పాము కనిపించింది.

అందరూ పకపకా నవ్వి, "ఒరే నీ స్వాములవారు పాములవా రయినారు! వారిని సమాధి చేసెయ్యి!" అన్నారు.

నిజమే ననుకుని భీమన్న ఆ చచ్చిన పామును ఊరిబయట గుంట తవ్వి పూడ్చి పెట్టి, ఆ సమాధివద్ద నాలుగు తులసి మొక్కలు నాటాడు.

ఈలోపల ఏట్లో పడిన బిచ్చగాడు, గట్టి అయువు కలవాడు కావటంచేత ఎలాగో ఒడ్డుకు చేరి అక్కడ ఒక చోట కూచుని అడుక్కోసాగాడు.

పాముకు సంస్కారం చేసి అటుగా వస్తున్న భీమన్న వాణ్ణి చూసి, "అహా, ఏమి స్వాములవారి మహిమ!" అనుకుని, తన నెత్తిమీద ఉన్న తట్ట దించి, "గురూ, ఇదుగో—తట్టా, బుట్టా, తప్పేలా, చెంబూ, లోటా, గరిటే, కర్రా—అంతే!" అన్నాడు.

బిచ్చగాడు మండిపడి, "దొంగ వెధవా! నన్ను ఏట్లో తోసి మళ్ళీ నా సేవ చేయ వచ్చావా? చూడు నిన్నేం చేస్తానో!" అంటూ అరిచాడు.

భీమన్న పరిగెత్తి ఇంటికి పోయి, బామ్మతో జరిగినదంతా చెప్పి, "నా వల్ల ఏ తప్పూ లేకుండానే స్వాములారు నా మీద మండి పడ్డారు, బామ్మా!" అన్నాడు.

"నువు వట్టి వెర్రివెంగళాయివి! నీకు ఎవరి సేవా వద్దులే. అడివికి పోయి కట్టెలు కొట్టి తెస్తూ ఇంటిపట్టునే పడి ఉండు!" అన్నది బామ్మ.

[ పై సంచికలో మరొక సంఘటన ]





# విధికి విరుగుడులేదు

ఒక గ్రామంలో ఒక రైతు వద్ద నంజయ్యా అనే గొడ్లకాపరి కుర్రవాడుండేవాడు. వాడు రోజూ ఉదయమే లేచి, తన యజమాని ఇంటి చాకిరిచేసి, చద్ది తిని, 'బారెడు పొద్దెక్కే సరికల్లా గొడ్లను మేపటానికి తోలుకు పొయ్యేవాడు.

గ్రామం వెలపల ఒక పాడుపడిన తోట ఉండేది. ఒకప్పుడు దానిలో మంచి మంచి ఫలవృక్షాలుండేవి. కాని ఇప్పుడు దానికి ఆలనా పాలనా లేదు. తోటంతటా ఏవేవో పిచ్చి మొక్కలు మొలిచాయి. గడ్డి విపరీతంగా పెరిగింది. ఆ తోటలో పశువులకు కావలిసినంత మేత. మేపుకుంటే అడిగే వాళ్ళులేరు. గొడ్లుకాసే కుర్రాళ్ళు ఎక్క ఆడుకోపటానికీ, కాయలు కోసుకు తినటానికీ చెట్లుకూడా ఉన్నాయి. అందుచేత నంజయ్యా తోటివాళ్లుకూడా పశువులను తోలుకుని ఆ తోటకే వచ్చేవాళ్ళు. పశువుల దారిన పశువులు మేత మేసేవి, కుర్రాళ్ళ దారిన కుర్రాళ్ళు సాయంకాలందాకా ఆడుకుని, పొద్దువాలగానే మళ్ళీ గ్రామానికి తిరిగి వెళ్ళేవాళ్ళు.

ఒకనాడు నంజయ్యా పశువులను తోలుకుని మామూలు ప్రకారమే తోటకు వచ్చాడు. కాని ఆ రోజు పండగ కావటం చేత మిగిలిన కుర్రాళ్ళెవరూ రాలేదు. పండగమాట నంజయ్యాకు తెలీదు. బిక్కు బిక్కుమంటూ తోటలో ఒంటరిగా ఉండటం వాడికేమీ బాగాలేదు. కాలుగాలిన పిల్లిలాగా తోటంతా కలయదిరిగాడు. తన చిరాకు పశువులమీద చూపి, వాటిని వాటిమానాన మేయనివ్వక ఇటునుంచి అటూ, అటు నుంచి ఇటూ మళ్ళించాడు.

అసలే చిరాకులో ఉన్న నంజయ్యా మీద ఒక కందిరీగ ఎటునుంచో వచ్చి వాలింది. అది తన మీదికి రావటం చూస్తూనే ఉండ

త్రిపురారి సత్యనారాయణ

టంచేత వాడు దాన్ని ఒక్క చరుపు చరిచి చంపేశాడు. అప్పటికీ కసితీరక వాడు దాని కళేబరాన్ని రెండుగా విరిచి విసిరి ఎడంగా పారేశాడు. అది ఒక దుబ్బుమీద పడుతూనే ప్రాణం వచ్చి తుంయి మని ఎగిరిపోయింది.

నంజయ్యు నిర్ఘాంతపోయి, కందిరీగ కళేబరం పడిన చోటికి వెళ్ళి జాగ్రత్తగా గమనించాడు. అది ఒక పొట్టి దుబ్బుమీద పడింది. ఆ దుబ్బునిండా దట్టంగా ఆకులున్నాయి. ఆ ఆకులు మిగిలిన ఆకుల్లా కాకుండా ఏంతో నేవళంగా ఉన్నాయి. ఆ ఆకుల మహిమవల్లే చచ్చిన కందిరీగ బతికి ఉంటుందని వాడికి తోచింది. సంజీవి మొక్కలను గురించి వాడు విని ఉండటంచేత అది సంజీవిమొక్క అయి ఉండవచ్చు ననుకుని వాడు దాన్ని జాగ్రత్తగా గుర్తుంచు కున్నాడు.

నంజయ్యు కింకా ఈ సంజీవిమొక్క పైన పూర్తిగా నమ్మకం కుదరలేదు. ఆ దుబ్బుమీద నుంచి ఎగిరిపోయినది తాను విసిరివేసిన కందిరీగ కాదేమో! వాడు తోటంతా వెతికి ఒక చచ్చిపోయిన మిడత శరీరం సంపాదించి తెచ్చి, దాన్ని నింపాదిగా సంజీవిమొక్క పైన ఉంచాడు. ఒక క్షణంలో అది కదిలి, అటు ఇటూ తిరిగి, చివ్వున ఎటో ఎగిరిపోయింది.



అది తప్పక సంజీవిమొక్కేననీ, దాన్ని తాకిస్తే ఏ చచ్చిన ప్రాణి అయినా తిరిగి బతుకుతుందనీ నంజయ్య రూఢి చేసుకున్నాడు. ఇది తనతోటి కుర్రాళ్ళకు ఎప్పుడు చెబుతానా అని వాడు తహతహలాడాడు.

కాని మర్నాడు కుర్రాళ్ళంతా పశువులను తోలుకుని తోటకు వచ్చే దారిలో వాడు మిగిలిన వాళ్ళతో తాను సంజీవిమొక్కను కనిపెట్టాననీ, దానితో చచ్చిన కందిరీగనూ, మిడతనూ బతికించాననీ చెబితే, వాళ్ళు అశ్చర్యపడటానికి బదులు వాణ్ణి గేలిచేసి, ఏడిపించారు. నంజయ్యకు వాళ్ళమీద కోపం వచ్చి తన రహస్యం రహస్యంగానే ఉంచేశాడు. కొద్ది రోజులు గడిచాయి. ఒకనాటి తెల్లవారుఝామున ఊరి కామందు చనిపోయాడు. అయనకు అ గ్రామంలో ఒక మిద్దె ఉన్నది. ఆ కామందు ధనికుడే కాక గొప్ప దాతకూడానూ. గుళ్ళు కట్టించాడు, నూతులూ, చెరువులూ తవ్వించాడు, సత్రం కట్టించాడు, ఇళ్ళు కట్టుకునే వాళ్ళకూ, పెళ్ళిళ్ళు చేసుకునేవాళ్ళకూ ఎన్నో దానాలు చేశాడు. అందుచేత గ్రామంలోవాళ్ళు అయన్ని దేవుడల్లే చూసుకునేవారు.

అయన నెలరోజులు మంచాన తీసుకుని మరీ పోయాడు. ఈ నెలరోజులూ ఆయనకు ఎన్నో రకాల చికిత్సలు చేశారు. ఎందరో



వైద్యులు చూశారు. కాని ఒక్కరి ప్రయత్నమూ ఫలించలేదు.

ఉదయంవేళ కామందు ఇంటిముందర జనం గుమికూడారు. కొందరు కామందును పొగడుతున్నారు. కొందరు శ్మశాన వైరాగ్యం చెబుతున్నారు. "వైద్యులంటే మందు లివ్వగలరు గాని ప్రాణం పొయ్యగలరా?" అని శాస్త్రులుగారు అంటున్నాడు.

ఈ మాట నంజయ్య చెవులబడింది; వాడు ఆ సమయానికి అటుగా పశువులను తోలుకుని తోటకు పోతున్నాడు. వాడు జరిగిన సంగతి తెలుసుకుని, "కామందు గారిని బతికించే ఉపాయం నేను చెబుతాను. పాడుపడిన తోటలో సంజీవి మొక్క ఉన్నది," అంటూ తన అనుభవం అక్కడి వారితో చెప్పాడు.

చాలామంది వాడి మాటలు నమ్మలేదు. ఒకరిద్దరు, దింపుడు కళ్ళాశగా, వాడివెంట తోటకు బయలుదేరారు.

నంజయ్య ముందూ, గ్రామస్తులు వెనకా తోటలో ప్రవేశించారు. తాను చూచిన దుబ్బు ఎక్కడుండేదీ వాడికి తెలుసు. దాదాపు రోజూ వాడు దాన్ని ఒకసారైనా కళ్లచూస్తునే ఉన్నాడు. అందుచేత వాడు సూటిగా అక్కడికే దారితీశాడు. కాని రోజూ కనిపించే ఆ నవనవలాడే ఆకులు వాడికి కనిపించలేదు. ఇది కాదు అదీ, అది కాదు ఇదీ అనుకుంటూ వాడు ఒక దుబ్బునుంచి ఇంకో దుబ్బుకు నడవసాగాడు.

గ్రామస్తులకు వాడిమీద కోపం వచ్చింది. వాళ్లచేత మాటలు పడటం ఒక వంకా, రోజూ కనిపించే దుబ్బు మాయం కావటం ఒక వంకా నంజయ్యను బాధించాయి. వాడు తోటంతా పదిహేనుసార్లు తిరిగినా ఆ దుబ్బుజాడ వాడికి తెలియనేలేదు.

ఇంతకూ పోయిన కామందు తిరిగి బతికే గీతలేదు. అందుకే ఎదురుగా ఉన్న సంజీవి కూడా నంజయ్యకు కనిపించకపోయింది.





# సైమన్

పోలండ్ దేశంలోని ఒక గ్రామంలో ఒక వసతి గృహం ఉండేది. బాటసారులు అందులో డబ్బుయిచ్చి బసచేయవచ్చు. ఆ వసతి గృహం నడిపేవాడికి సైమన్ అని ఒక కొడుకు ఉండేవాడు. వాడికి చక్కదనమూ, తెలివితేటలూ, ధైర్యసాహసాలూ ఉన్నాయి; కాని వాడు వట్టి అకతాయి, సోమరిపోతూ, కొంచెంకూడా భాధ్యత తెలియనివాడు. ఏ పని చెయ్యటానికీ వాడికి ఒళ్ళు వంగేదికాదు, కాని లోపల ప్రపంచమంతా జయించాలనీ, ఏ రాజకుమార్తెనో పెళ్ళాడాలనీ, అమాంతం గొప్పవాడై పోవాలనీ కలలు కంటూండేవాడు. అంతలేని ఆశలు లోపల ఉన్నా వాడు అస్తమానమూ అలగా వెధవల వెంట తిరుగుతూ, తాగుతూ, జూదాలాడుతూ కాలం గడిపేవాడు. వాడి సొంత ఖర్చుకు తండ్రి కొంత డబ్బు ఇచ్చేవాడు. కాని అది చాలనప్పుడు సైమన్ తన తండ్రి గల్లా పెట్టెలో నుంచి డబ్బు కాజేస్తూ ఉండేవాడు.

సైమన్‌కు బుద్ధి వచ్చేటట్టు చేయాలని వాడి తండ్రి నయానాభయానా ఎంతగానో చెప్పిచూశాడు, కాని ప్రయోజనం లేకపోయింది. అందుచేత అయన ఒకనాడు వాడికి భటుడి దుస్తులు తొడిగి, చేతికి ఒక ఈటె ఇచ్చి, "నువు వెళ్ళి రాజుగారి దగ్గిర కొలువుచేసుకుని బతుకు," అని ఇంటి నుంచి తరిమేశాడు.

సైమన్ రాజుగారి కోట వద్ద గస్తీ తిరిగే భటుడుగా చేరాడు. వాడిబుద్ధి ఏమాత్రమూ మారలేదు. ఇప్పుడుకూడా వాడు పనికిమాలిన వాళ్లను వెంటవేసుకుని తాగటమూ, తందనాలు వెయ్యటమూ, జూదాలాడటమూ, పోట్లాటలు పెట్టుకోవటమూ మొదలైన పనులు చేస్తూ వచ్చాడు. వాడి బస వృద్ధ సైనికుడి ఇంట్లో. సైమన్ రోజూ ఆ సైని

సి. మాధవరావు



కుడితో, "ఇక్కడికన్న మా ఊళ్ళోనే బాగుండేది. మా ఇంట్లో బోలెడంత డబ్బు, సుష్టుగా తిండి, రకరకాల సారాయిలూనూ!" అంటూండే వాడు.

ఒకనాడు సైనికుడు సైమన్‌తో, "మీ తండ్రి అంత డబ్బు గలవాడైతే, నీకు పెద్ద ఉద్యోగమయిందనీ, నిన్ను కొత్వాలు చేశారనీ, విందులు చెయ్యటానికి డబ్బు పంపమనీ ఉత్తరం రాయి. ఖర్చుకు పనికి వస్తుంది," అన్నాడు.

సైమనుకు ఈ సలహా బాగా నచ్చింది. ముసలి సైనికుడు చెప్పినట్టే వాడు తండ్రికి ఉత్తరం రాశాడు. ఈ ఉత్తరం చూసుకుని, తన కొడుకు ఇంత కాలానికి పైకివస్తున్నాడు గదా అని సంతోషించి, వసతిగృహయజమాని సైమనుకు కొంత డబ్బు పంపించాడు. దానితో సైమను ఒక చిన్న వెలుగు వెలిగి మళ్లీ యథాస్థితికి వచ్చాడు.

అయితే ఇప్పుడు తండ్రి దగ్గిర నుంచి డబ్బు తెప్పించుకునే ఉపాయం వాడికి తెలిసి పోయింది. కొంతకాలం ఆగి వాడు తండ్రికి తాను జమేదారు ఉద్యోగం సంపాదించినట్టు రాసి మరికొంత డబ్బు తెప్పించుకున్నాడు. ఇలాగే వాడు తనకు సుబేదారు పదవి వచ్చినట్టూ సైన్యంలో తనను దళనాయకుణ్ణి చేసినట్టూ తండ్రికి రాసి పెద్ద పెద్ద మొత్తాలు తెప్పించుకుని యథేచ్ఛగా ఖర్చుచేశాడు. అయితే ఇంత కాలమూ వాడు చేస్తున్న ఉద్యోగం ఈటె పట్టుకుని గస్తీ తిరగటమూ, కోటముందు పహరా కాయటమూ మాత్రమే.

మళ్ళీ సైమన్‌కు డబ్బు ఇబ్బంది వచ్చింది. ఈసారి తండ్రికి రాస్తే తనను సేనానాయకుణ్ణి చేశారనే రాయాలి. సైమన్ తండ్రికి ఆ మాటే రాస్తూ పుష్కలంగా డబ్బు పంపమని అడిగాడు.

ఈ ఉత్తరం చూసుకుని సైమన్ తండ్రీ తల్లీ పరమానందం చెందారు.

"మనవాడు ఇంత పైకి వచ్చాక మనం వెళ్ళి చూడవలిసిందే. వెంటనే ప్రయాణానికి సిద్ధంకా," అన్నాడు సైమన్ తండ్రి.

భార్యా భర్త లిద్దరూ బండిలో ఎక్కి రాజధానికి వచ్చారు. వాళ్ళు వచ్చి చేరేసరికి పెద్ద ఎత్తున సైనికోత్సవం జరుగుతున్నది. ఫిరంగులు పేలుతున్నాయి. సైనికులు వీధులలో కవాతు చేస్తున్నారు. బాండు వాయిస్తున్నారు. ఉన్నత సైనికాధికారు లందరూ ఊరేగుతున్నారు.

సైమన్ తల్లి దండ్రులు వీధి పక్కన జనంతోబాటు నిలబడి సైనికాధికారుల ఊరేగింపు చూశారు. వారిలో సైమన్ కనబడలేదు. వాళ్ళు తమ పక్కన ఉన్న వాళ్ళను, "సేనానాయకుడు సైమన్ ఈ ఊరేగింపులో లేడేం?" అని అడిగారు.

"సైమన్ అనే సేనానాయకుడెవరూలేడే! ఆ పేరుగల గస్తీభటు డొకడున్నట్టున్నది!" అని జవాబు వచ్చింది.

ఈ మాట వినగానే సైమన్ తండ్రికి మండిపోయింది. అయన కొత్వాలు వద్దకు వెళ్ళి తన కొడుకును తన వశం చెయ్యమని కోరాడు. అతను అలాగే చేశాడు. తండ్రి సైమన్‌ను చిత్రవధ చెయ్యటానికి నిశ్చయించుకున్నాడు. ఆ కాలంలో ఆ దేశంలో



తండ్రికి కొడుకు ప్రాణాలపై అన్ని హక్కులూ ఉండేవి.

"వాణ్ణి శిక్షించండి గాని చంప వద్దు!" అని తల్లి బతిమాలుకున్నది.

"వీడు బతికి ఉండటమే నాకు పరువు చేటు," అంటూ సైమన్‌ను తండ్రి బండీ వెనక పడేసి బండి తోలించుకుని ఇంటికి ప్రయాణమైనాడు.

సైమన్‌కు పట్టిన దుర్గతి గురించి ముసలి సైనికుడికి ముందే తెలిసిపోయింది. వాడి దుర్గతికి కొంతవరకు తానే కారణం గనక వాణ్ణి కాపాడటం తన విధి అనుకుని ఆ ముసలి సైనికుడు రహదారి కాచి, బండీ

గుంటలలో పడి అటూ ఇటూ ఒరుగుతూ పోయే సమయంలో, వెనకగా వెళ్ళి, కత్తితో సైమన్ కట్టు తాళ్ళు కోసి బండి నుంచి దింపాడు. తరవాత ఆ ముసలివాడు సైమన్‌తో, " ఇక నీకు ఈ ప్రాంతాల క్షేమం లేదు. అడవికి అడ్డంపడి ఏదైనా దూరదేశం చేరుకుని అక్కడనైనా బుద్ధిగా బతుకు," అని సలహా ఇచ్చాడు.

సైమన్ అడవుల వెంబడి పడి బయలు దేరాడు. ఇప్పుడు వాడికి నిజమైన స్వేచ్ఛ లభించినట్టు తోచింది. ఇక అన్ని దేశాలూ తనవే. ఇక తాను ఎంతలేసి గొప్పపనులైనా సాధించవచ్చు. వాడు ఎక్కడా ఆగకుండా ఎన్నో గ్రామాలూ, నగరాలూ తిరిగాడు. ఈ ప్రయాణాలలో వాడు వేణువు వాయించటం అభ్యసించి అందులో మంచి ప్రావీణ్యం సంపాదించాడు. వెళ్ళినచోటనల్లా వాడికి మంచి ఆతిథ్యం దొరుకుతూవచ్చింది.

పోగాపోగా సైమన్‌కు ఒక చోట ఒక కొండమీద ఒక రాజభవనం కనిపించింది. కొండ కింద మరొక రాజ భవనం ఉన్నది. కొండకింద ఉండే రాజ భవనం దేదీప్యమానంగా ఉన్నది. కాని కొండపైది పాడు పెట్టినట్టుగా ఉన్నది. ఈ భవనాలను గురించి సైమన్ అక్కడి ప్రజలద్వారా తెలుసుకున్నాడు.



కొండపైన ఉన్న రాజభవనం చచ్చిపోయిన రాజుగారిది. ఆ రాజు అపారమైన ధనం సంపాదించాడు, కాని బతికి ఉన్నన్నాళ్ళూ మహా క్రూరుడనిపించుకున్నాడు, జనాన్ని పీడించుకు తిన్నాడు, సమస్తమైన పాతకాలూ చేశాడు. చచ్చి దయ్యమై ఆయన ఆ రాజభవనాన్ని పట్టాడు. అందుచేత ఆయన కుమారుడు కొండమీది రాజభవనాన్ని పాడుపెట్టి, కొండ కింద మరొక భవనం కట్టుకుని అందులో తన కుమార్తెతో నివసిస్తున్నాడు.

ఈ రాజుగారి కూతురు గొప్ప అందగత్తె. ఆమెను పెళ్ళాడటానికి ఎందరో యువకులు సిద్ధంగా ఉన్నారు. కాని, కొండమీది రాజభవనాన్ని ఆశ్రయించిన దయ్యాన్ని వదలగొట్టినవాడే ఆమెకు భర్త కాగలడని ఆమె జాతకంలో రాసి ఉంది. అందుకు సిద్ధమై కొందరు యువకులు దయ్యాన్ని పారదోలుతామని కొండమీది రాజభవనానికి వెళ్ళారు. వాళ్ళు మళ్ళీ తిరిగి రాలేదు. దయ్యం వారి ప్రాణాలు తీసి ఉంటుంది. ఈ విధంగా కొందరు చచ్చిన మీదట రాజకుమార్తెను పెళ్ళాడతానని కొత్తవారెవరూ సాహసించి రాలేదు. రాజకుమార్తె తన స్థితి తలుచుకుని అస్తమానం కన్నీరు కార్చుతూ ఉండేది. రాజుగారు తన కుమార్తె దుఃఖం





చూసి ఎంతో విచారించేవాడు. కాని ,ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాడు.

ఈ కథ అంతా వింటూనే సైమస్ తానే ఆ దయ్యాన్ని పారదోలి రాజకుమార్తెను పెళ్ళాడాలని నిశ్చయించుకున్నాడు. ఒకప్పుడు వాడు తన గ్రామంలో ఇటువంటి పనులు చెయ్యాలనే కలలు కనేవాడు. ఆ కలలు నిజం కావటానికి ఇప్పుడే వాడికి అవకాశం వచ్చింది. దయ్యం చేతిలో తాను చచ్చినా చావవచ్చు. అయితే ఆ భయం వాణ్ణి అంతగా బాధించలేదు.

ఆ రాత్రి ఎక్కడో తలదాచుకుని మర్నాడు తెల్లవారుతూనే సైమస్ తన వేణువు తీసుకుని కొండకింది రాజభవనం వెలపల ఉండే ఒక చెట్టు కింద చేరి, శ్రావ్యంగా గానం చెయ్యసాగాడు.

అప్పటికే రాజూ, రాజకుమార్తే లేచి కాలకృత్యాలు తీర్చుకుని ఉదయపు ఫలహారం చెయ్యబోతున్నారు. రాజకుమార్తెను వేణుగానం ఎంతో ఆనందపరిచింది, ఉత్సాహం కలిగించింది.

"నాన్నా, ఆ పాట చాలా బాగుంది. ఆ వాయించేవాణ్ణి పిలిపించి మన ఇంట్లో ఉంచుకుందామా? నాకు మరీ దిగులుగా ఉన్నప్పుడు వేణుగానం చేస్తాడు!" అన్నది రాజకుమార్తె.

తనకుమార్తె విచారం తగ్గటానికి ఏమి చెయ్యమన్నా రాజుగారు సిద్ధంగానే ఉన్నాడు. ఆయన తన కుమార్తెతో, "దానికేం భాగ్యమమ్మా? అలాగే వాణ్ణి యిక్కడికి పిలిపిద్దాం!" అన్నాడు.

రాజకుమార్తె నౌకర్ల కోసం ఆగక తానే రాజభవనం నుంచి బయటికి వచ్చి, చెట్టు కింద కూచుని వేణుగానం చేస్తున్న సైమస్‌ను సమీపించి, లోపలికి రమ్మని అతన్ని ఆహ్వానించింది. ఆమెను ప్రత్యక్షంగా చూసినాక సైమస్, తాను విన్నదానిలో అతిశయోక్తి ఏమీ లేదనీ, ఆమె

సౌందర్యానికి నిజంగా అప్సరసేసనీ అనుకున్నాడు. ఫలహారాలు అయినాక రాజుగారు సైమన్‌ను తన ఆస్థాన విద్వాంసుడుగా ఉండిపొమ్మని కోరుతూ, కొండమీది రాజభవనాన్ని దయ్యం అపహించిన సంగతీ, దాన్ని వదలగొట్టిన వాడే రాజకుమార్తెకు భర్తగా రాసిపెట్టి ఉన్న సంగతీ చెప్పాడు.

"నేనీ సంగతులు నిన్ననే విన్నాను. ఆ దయ్యాన్ని వదిలించి రాజకుమార్తెను పెళ్ళాడాలన్న ఉద్దేశంకూడా నాకు అప్పుడే కలిగింది," అన్నాడు సైమన్ ఏమాత్రమూ జంకులేకుండా.



రాజకుమార్తె పైకి ఏమీ అనలేదు గాని ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. ఎంతోమందిని బలిగొన్న దయ్యంతో తలపడటానికి సిద్ధంగా ఉన్నాడంటే సైమన్ సాహసాన్ని ఆమె మెచ్చుకున్నది. అతను నిజంగా దయ్యాన్ని పారదోలి తనను పెళ్లాడే పక్షంలో తనకు కావలిసింది మరొకటి లేదనీ, సైమన్ చాలా అందగాడైన యువకుడనీ ఆమె సంతోషించింది. మరొక వంక సైమన్‌కూడా దయ్యానికి బలి అయిపోతాడేమోనన్న భయం ఆమెను వేధించింది.

రాజు మటుకు సైమన్ నిర్ణయాన్ని మార్చటానికి విశ్వప్రయత్నాలు చేశాడు. సైమన్ తన నిర్ణయాన్ని మార్చ దలుచుకో లేదు. అందుచేత రాజుగారు సైమన్ కోసం ఒక బండి సిద్ధంచేయించి, సూర్యాస్తమయంవేళ అతన్ని బండిలో కొండమీది రాజభవనం వెలపల దిగబెట్టించాడు.

సైమన్ ఉత్సాహంతో బండిలో నుంచి కిందికి దూకి పాడుపడి ఉన్న రాజభవనంలోకి ప్రవేశించాడు. నడవ దాటగానే విశాలమైన చావడి ఉన్నది. అక్కడ గోడలమీద పెద్ద పెద్ద చిత్రరువులున్నాయి, బంగారు చట్రాలుగల అద్దాలున్నాయి, ఖరీదైన పట్టు తెరలు గోడలకు వేళ్లాడుతున్నాయి. అయితే ప్రతి వస్తువూ మట్టి కొట్టుకుని ఉన్నది.

సైమన్ ఈ చావడిలో ఒక కుర్చీలో కూచుని ఏదో పుస్తకం చదువుకుంటూ దయ్యం రాక కోసం ఎదురు చూడసాగాడు. ఒక్కొక్క గంటే గడుస్తున్నది. సరిగా అర్ధ రాత్రి అయేసరికి దూరాన అడుగులచప్పుడు వినిపించింది. ఆ చప్పుడు దగ్గిరపడుతున్న కొద్దీ సైమన్ గుండె వేగంగా కొట్టుకోసాగింది. కాని వాడు కదలక మెదలక కుర్చీలో అలాగే కూచున్నాడు.

కొద్దిసేపటికి బయటి తలుపులు తెరుచుకుని ఒక వృద్ధుడి ఆకారం లోపలికివస్తూ కనిపించింది. ఆ ఆకారం కారు నలుపుగా ఉన్నది. దాని చేతిలో ఒక తాళపుచెవుల గుత్తి ఉన్నది. వృద్ధుడి కళ్ళుమాత్రం జ్యోతుల్లాగా వెలుగుతున్నాయి.

సైమన్ తన దృష్టి పుస్తకం మీదే ఉంచి కదలకుండా కూచున్నాడు. వృద్ధుడు వాణ్ణి సమీపించి, "నా భవనంలో కూచోవటానికి నీకు అనుమతి ఎవరిచ్చారు?" అని అడిగాడు.

"ఎవరూ అనుమతి ఇవ్వలేదు. ఇక్కడ ఎవరూ లేరని తెలిసి ఈ రాత్రి గడుపుదామని నేనే వచ్చాను," అన్నాడు సైమన్.

"నీకు అంత ధైర్యం ఉందిగా? నా చేత ఇప్పటికి ఎంత మంది మూర్ఖులు చచ్చారో నువు వినలేదా?" అని అడిగింది దయ్యం.



"నేను ఒకంతట దడుచుకునే వాణ్ణి కాను. నేను కాపును, కాపులవంశంలో పుట్టాను. తమరు బతికుండగా భయంకరంగా ఉండేవారేమో తెలీదుగాని ఇప్పుడేమంతలేదు!" అన్నాడు సైమన్.

"చాలా దర్పంగా మాట్లాడుతున్నావే, కులహీనుడా! చివరిదాకా అలాగే మాట్లాడగలవా? చూస్తాం! ఈ తాళపుచెవులు తీసుకుని అవతల గది తలుపులు తెరు," అన్నది దయ్యం.

"నాకు భయంలేదని నిరూపించటానికి నీ వెంట రమ్మంటే వస్తానుగాని, నీకు తలుపులు తెరవటానికి నేను నీ నౌకర్ను కాను. నీ యిల్లు; నీ తలుపులు నువే తెరుచుకో!" అన్నాడు సైమన్.

దయ్యం మారుమాటాడక తలుపు తానే తెరిచి అవతలి గదిలోకి అడుగు పెట్టింది. అది గుమ్మం దాటే సమయంలో దాని నెత్తి పైనున్న జుట్టు నలుపు విరిగి తెల్ల బడ్డట్టుగా సైమన్‌కు కనిపించింది.

ఆ గది దాటి దయ్యం మరొక గది తలుపులు తెరిచింది. సైమన్ దయ్యం వెంబడి తానూ ముందుకు వెళ్ళాడు. ఒక్కొక్కగదే దాటుతున్నకొద్దీ దయ్యం పైనుంచి కిందికి క్రమంగా తెల్లబడుతూ వస్తూండటం గమనించి సైమన్ చాలా సంతో



షించాడు. మధ్య మధ్య ఆ దయ్యం తాళపుచెవులు సైమన్‌కు అందించి, "తలుపు తెరు!" అంటూ వచ్చింది. కాని దాని ఆజ్ఞను పాలించక పోవటమే తనకు క్షేమమని వాడు తెలుసుకుని, "నీ యిల్లు, నువే తలుపులు తెరుచుకో!" అని జవాబిచ్చాడు.

ఏడు గదులు గడిచేసరికి దయ్యానికి నడుముకు పైభాగమంతా తెల్లగా రంగు విరిగిపోయింది. పన్నెండో వాకిలి దగ్గిరికి వాళ్ళు చేరుకునే సమయానికి దయ్యం ఆ పాదమస్తకం రంగువిరిగి తెల్లగా ఉన్నది. పన్నెండో వాకిలి తలుపులు తెరవగానే కుళ్ళిన శవాల వాసన గుప్పున కొట్టింది. ఆ వాసనకు సైమన్ తల గిర్రున తిరిగి పోయింది. ఆ గదినిండా శవాలు పెద్ద గుట్టగా పడి ఉన్నాయి.

దయ్యం సైమన్ కేసి తిరిగి చిరునవ్వు నవ్వి, "వీళ్ళందరూ నా చేత చచ్చినవాళ్ళే. నాకు విమోచనం కలిగించే మార్గం వీళ్లలో ఒక్కడికీ తెలియలేదు. ఈ పని కాపువాడి పల్లనే కావాలని రాసిపెట్టి ఉందనుకుంటాను. ఏమనాలో, ఏంచెయ్యాలో తెలుసుకున్నవాడివి నువు ఒక్కడివే! నీ ప్రాణం కాపాడుకోవటమేగాక ఈ భవనానికి కూడా ప్రాణప్రతిష్ఠ చేశావు. నామటుకు నాకు ఈ ప్రపంచంతో ఇంతకాలానికి విముక్తి కలిగింది; మరో లోకంలో నేనింకా ఏమి అనుభవించాలో తెలీదు. అదుగో, నేను వీళ్ళందరినీ చంపిన గొడ్డలి; దానితో నా తల నరికెయ్యి, నేను పోతాను!" అన్నది.

సైమన్ మొదట అనుమానించి చివరకు దయ్యం కోరిన ప్రకారం దాని మెడ మీద గొడ్డలితో ఒక్క పెట్టుపెట్టాడు. మరుక్షణం దయ్యం శరీరం నుసినుసి అయిపోయింది. ఆ నుసి మధ్య నుంచి ఒక చిన్న పిట్ట తుర్రుమని ఎగురుతూ కిటికీ గుండా ఆకాశంలోకి ఎగిరిపోయింది.

—(ముగింపు వచ్చే సంచికలో)





# బీదవాడి అదృష్టం

ఒక ఊళ్ళో ఒక కాపు ఉండేవాడు. అతనూ, అతని భార్యా ఎంతో ధర్మబుద్ధి గలవాళ్ళు. అయితే వారికి గంపెడు పిల్ల లుండటంచేత, భార్యాభర్తలిద్దరూ ఒళ్ళు విరుచుకుని పనిచేసినా అందరి పొట్టలూ నిండటానికి గంజి తప్ప మరేమీ ఉండేది కాదు. ఏ పూట అయినా సంకటి తింటే ఆ పూట వారికి విందే.

ఇంతగా తిండికి కటకట పడుతున్నా ఆ కాపు దంపతులు ఆకలిగొని వచ్చిన వారికి ఎన్నడూ లేదని ఎరగరు. తాము తాగే గంజిలోనే అతిథికికూడా ఎంతో ప్రేమగా ఇంత పోసేవారు.

ఒకనాడు వాళ్లందరూ భోజనానికి కూచున్న సమయంలో ఒక బికారివాడు ఆకలితో మలమల లాడుతూ వచ్చాడు. కాపూ, అతని భార్యా తాము తాగబోతున్న గంజిలో నుంచి సగం సగం తీసి ఆ బికారి వాడికి పోశారు. కొనప్రాణంతో ఉన్నట్టు కనిపించిన ఆ బికారి ఆ గంజి తాగి అమృతం తాగినవాడిలాగా కోలుకున్నాడు. వాడి ముఖానికి ఒక కళ వచ్చింది. వాడు కాపుతో, "మీ దంపతుల వంటి పుణ్యాత్ము లను నే నెక్కడా చూడలేదు. మీరు గంజి చేసుకునే చట్టి పట్టుకురండి, దానిని అక్షయ పాత్రగా మారుస్తాను," అన్నాడు.

కాపుభార్య తమ చట్టిని తెచ్చి బికారి కిచ్చింది. వాడు దాన్ని చేతబట్టుకుని ఏదో మంత్రాలు చదివి, దానిపై మూకుడు ఉంచి, "ఇక మీరు తిండికి వాచిపో నవసరం లేదు. రాజుగారి వంటసాలలో తయారయే ప్రతి వంటకమూ ఈ చట్టిలో మీకు దొరుకుతుంది," అని చెప్పి ఆ క్షణం లోనే లేచి బయటికి వెళ్ళిపోయాడు.

కాపు దంపతులు ఈ బికారివాడి మాటలు నమ్మలేదుగాని, వాటిని ఒక

ఎల్. ఆదినారాయణ

ఆశీర్వాదంగా మటుకు భావించారు. అయితే ఆ రాత్రి కాపుభార్య గంజి కాయటానికి చట్టి మీద మూకుడు ఎత్తేసరికి, కమ్మని వాసనలు వెదజల్లుతూ చట్టి నిండుగా వంటకాలున్నాయి. అందరూ ఎక్కువెక్కువగా తిన్నప్పటికీ అవి తరగలేదు. అది నిజంగా రాజభోజనమే.

అదిమొదలు కాపుదంపతులూ, వాళ్ళ పిల్లలూ ఆ చట్టి ధర్మాన తాము రాజభోజనాలు చెయ్యటమేగాక తమ ఇంటికి వచ్చిన అతిథులకుకూడా అదే భోజనం పెడుతూ వచ్చారు. కాపు తన ఇంటికి వచ్చిన అతిథులతో, "అయ్యా, నేను పెట్టేది తినండి గాని, దాన్ని గురించి నన్ను ఎలాటి ప్రశ్నలూ వెయ్యకండి," అని వేడుకునేవాడు. అతని ఇంట భోజనం చేసినవాళ్ళు ఇతర చోట్లకు వెళ్ళి, "ఫలాని రైతు పెట్టిన భోజనమే భోజనం! మహారాజులకు తప్ప అటువంటి భోజనం దొరకదు!" అని చెప్పుకునేవాళ్ళు.

కాపు ఇంట ఈవిధంగా జరుగుతూంటే, అవతల రాజుగారి ఇంట వంటకాలు తరిగిపోతూండటం జరిగింది. ఈసంగతి మొట్టమొదటగా రాజుగారి వంటవాడు గమనించాడు. వాడు రాజకుటుంబానికి కావలిసిన దానికంటె ఎక్కువగానే వండినప్పటికీ, ఒక్కొక్కసారి వంటకాలు చాలీచాలకుండా



ఉండేవి. గిన్నెనిండా పాయసం తయారు చేసి మూతపెడితే వడ్డించే సమయానికి గిన్నెలో పాయసం వెలితిగా ఉండేది. ప్రతి పూటా ఇదే జరుగుతూ ఉండటంచేత వంట వాడు ఇదేదో దొంగ చేస్తున్నపని అను కున్నాడు. అయితే ఆ దొంగ ఎవడో వాడికి తెలియలేదు.

చివరకు వాడు జరుగుతున్న వింతను గురించి రాజుగారికి విన్నవించుకున్నాడు. రాజుగారు మొదట వాడి మాటలు నమ్మ లేదు. తరవాత ఆయన స్వయంగా పరీ కించి వంట పాత్రలలోని వంటకాలు తరిగి పోతూ ఉండటం గమనించాడు.

రాజు ఈ విషయాన్ని మంత్రితో చెప్పాడు. మంత్రికూడా స్వయంగా పరీ కించి, వంటకాలు తరిగిపోతున్నాయని రూఢి చేసుకున్నాడు. రాజుగారి ఇంటి రహస్యం గుట్టుగా ఉండదు. ప్రతిపూటా రాజుగారింటి వంటకా లెవరో ఎత్తుకు పోతున్నారనే వార్త ఊరంతా పాకింది. ఇంకో వేపునుంచి కాపు ఇంట రోజూ రాజభోజనం చేస్తారన్న వార్త కూడా పాకింది. ఈ రెండు పుకార్లూ కలుపు కుని అర్థం చేసుకున్నవారికి, రాజుగారింట మాయమయే వంటకాలు ఎలాగో కాపు ఇంటికి చేరుతున్నాయి అన్న అనుమానం తల ఎత్తింది. త్వరలోనే ఈ అనుమానం






రాజుదాకానూ, మంత్రిదాకానూ వెళ్ళింది. "అసంభవం! నేను విచారించాను. ఈ కాపు ఊరి చివర ఒక గుడిసెలో ఉంటున్నాడు. చాలా పేదవాడు. కాని దేవుడిలాటి వాడని చెప్పుకుంటారు. ఏమైనా వాడు ప్రతిపూటా మన దివాణానికి వచ్చి పంటకాలు మాత్రమే దొంగలించుకు పోతున్నాడంటే అది నమ్మరాని విషయం. అంత రహస్యంగా రాజభవనంలోకి రాగల వాడు ఎంత విలువైన వస్తువునన్నా ఎత్తుకు పోయి సుఖంగా బతకవచ్చు. పూట పూటా దొంగతనానికి రావటమంటే మాటలా?" అన్నాడు మంత్రి.

"అయినా మనం వెళ్ళి ఒకపూట వాడి ఇంటి తిండి తింటే నిజం తెలిసిపోతుంది. వాడు ఇంటికి వచ్చిన అతిథికి లేదనడుట," అన్నాడు రాజు.

సరే, రాజూ, మంత్రీ మామూలు దుస్తులు ధరించి, పెద్ద పెద్ద తలపాగాలు చుట్టి, చేతి కర్రలు పట్టుకుని ఎవరికీ తెలియకుండా కాలినడకను కాపు ఉండే ఇంటికేసి బయలుదేరారు. బయలుదేరే ముందు వారు రాజుగారింట ఏమేమి కూరలూ, పాయసాలూ అవుతున్నాయో వంటవాణ్ణి అడిగి తెలుసుకున్నారు.

అక్కడ కాపు ఇంట కాపు కుటుంబం వారంతా భోజనాలకు కూచోబోతుండగా ఇద్దరు అజానుబాహులు వచ్చి, "అయ్యా, మేం పొరుగూరి రెడ్లం. ఎండపడి వచ్చాం. ఈ పూటకు కాస్త భోజనం పెట్టించ గలరా?" అని అడిగారు.

కాపు లేచి వారిని ఎంతో ప్రేమతో ఆహ్వానించి, వారికికూడా ఆకులు వేయించి భార్యచేత వడ్డన చేయిస్తూ, "అయ్యలారా, నేను పెట్టినది తిని వెళ్లండి. దయచేసి నన్నేమీ ప్రశ్నలు వెయ్యవద్దు!" అన్నాడు.

ఆకులలో వడ్డన అవుతుండగానే అవి రాజుగారి వంటసాలలో చేసిన వంటకాలని,

మారువేషంలో ఉన్న రాజుకూ, మంత్రికీ తెలిసిపోయింది. వాళ్ళు భోజనం చెయ్యటానికి వచ్చినవారు కారుగనక, కాపుతో, "శ్రీమంతులకుకూడా సాధ్యంకాని ఈ భోజనం నీకెట్లా దొరికింది?" అని అడిగారు.

"దయచేసి నన్నేమీ అడక్కండి," అన్నాడు కాపు.

"చెబితేనేగాని మేము ముద్ద ఎత్తేది లేదు," అన్నారు అతిథులు.

విధిలేక కాపు జరిగినదంతా చెప్పాడు. రాజుగారికి అంతా వినేసరికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన చివాలున లేచి తన చేతికర్రతో కాపు చట్టి పగలగొట్టి మంత్రిని వెంట బెట్టుకుని మారుమాట లేకుండా వెళ్ళిపోయాడు.

కాపుభార్య చట్టిపెంకులు తడువుతూ కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

"ఊరుకోవే! మనం ఎప్పుడూ రాజభోజనమే చేశామూ ఏమిటి? ఇవాళతో మనకు భోజన సుఖం పూర్తి అయింది. మన కలో, గంజో మనకుండనే ఉంది," అని భర్త ఆమెను ఓదార్చాడు,

కాపు కుటుంబంవాళ్ళ చట్టి పగలగొట్టేసి ఇంటికి తిరిగి వెళ్ళిన రాజుకూ, మంత్రికీ ఆ పూట భోజనం లేకుండాపోయింది.



"మహారాజా, వంటకాలు పొయిమీద పాత్రల్లో ఉండగానే మాయమవుతున్నాయి. కావలిస్తే పాత్రలు చూడండి—బయట అంతా మసి, లోపల తోమినట్టు ఎలా ఉన్నాయో! ఒక్కొక్క పాత్ర అరేసిసార్లు కూరలతో నించి పొయిమీద పెట్టాను. క్షణంలో ఖాళీ అయిపోతున్నాయి!" అన్నాడు వంటవాడు.

రాజుగారు కాపు ఇంట భోజనం చేసి వచ్చిన వాడైనాకాడు. మంత్రి తన ఇంటి నుంచి రాజకుటుంబానికి భోజనం పంపాడు. కాని రాజుగారిల్లు చేరేసరికి ఆ వంటకాలు కూడా మాయమయాయి.

తాను చేసిన అన్యాయం కట్టికుడుపుతున్నదని రాజుకు తెలిసివచ్చింది. ఆయన మంత్రితో సహా కాపు ఇంటికి వెళ్ళి, కాపు కాళ్ళపైపడి, "నేను కోపావేశంలో చేసిన దుర్మార్గాన్ని క్షమించాలి. మీ చట్టి పగలగొట్టినందుకు పరిహారంగా పెద్ద మాన్యం ఇస్తాను. ఇకనుంచీ మా వంటసాలే మీ వంటసాల. రోజూ మా ఇంట చేసే వంటకాలలో సగం మీ ఇంటికి పంపుతాను. నన్నూ, నా కుటుంబాన్ని తిండికి మాడ్చి చంపితే మీకేం లాభం?" అని ప్రాధేయ పడ్డాడు.

కాపు కంగారుపడి, "అయ్యో, నేను మీకేమీ చెయ్యలేదు. చట్టి పగిలిందని నా భార్య ఏడుస్తుంటే గంజి తాగి బతుకుదాం లెమ్మని చెప్పాను. మీకు అన్యాయం జరిగితే అది నా వల్ల జరగలేదు. మిమ్మల్ని క్షమిస్తే, నాకు చట్టి ఇచ్చిన మహానుభావుడే క్షమించాలి," అన్నాడు.

తన వంటలో సగం కాపు కిస్తానన్నాక రాజుగారి వంటసాలలో చేసిన వంటకాలు చేసి నట్టున్నాయి. కాపు రాజుగారిచ్చిన మాన్యంతో సుఖంగా జీవిస్తున్నప్పటికీ వారికి రాజభోజనం పూట పూట వస్తూనే ఉండేది. ఆ విధంగా ఆ కుటుంబానికి మూడుతరాల పాటు జరిగింది.






తాటకను సంహరించి, మారీచ సుబాహులను కొట్టి, విశ్వామిత్రుడి యాగాన్ని నిర్విఘ్నంగా కొనసాగించిన నాటి రాత్రి రామలక్ష్మణులు హాయిగా నిద్రపోయి వేకువతోనే లేచారు. వారు కాలకృత్యాలు తీర్చుకుని, విశ్వామిత్రుడూ ఇతర మునులూ ఉండే చోటికి వెళ్ళి, వారందరికీ నమస్కారాలు చేసి, విశ్వామిత్రుడితో, "మహాముని, మీ ఆజ్ఞ నిర్వర్తించాము. ఇంకా చెయ్యవలిసిన పనులేవైనా ఉంటే సెలవియ్యండి," అని అడిగారు.

అప్పుడు మునులు రామలక్ష్మణులతో ఇలా చెప్పారు: "మిథిలానగరాన్ని పాలించే జనక మహారాజు ఒక గొప్పయాగం చెయ్యబోతున్నాడు. మేమంతా బయలుదేరి అక్కడికి వెళుతున్నాము. ఒకప్పుడా జనక మహారాజు ఒక యాగం చేసి దానికి ఫలితంగా దేవతల నుంచి ఒక అద్భుతమైన ధనుస్సు సంపాదించాడు. దేదీప్యమానంగా వెలిగిపోయే ఆ ధనుస్సును ఆ మహారాజు తన ఇంట ఉంచుకుని రోజూ సుగంధధూప దీపాలతో అర్చిస్తూ ఉంటాడు. ఆ ధనుస్సును దేవతలుగాని, రాక్షసులుగాని ఎక్కుపెట్టలేరంటే ఇక మనుషులమాట చెప్పాలా? మహా బలశాలులైన రాజులూ, రాజకుమారులూ ఎందరో ప్రయత్నించికూడా దాన్ని ఎక్కుపెట్టలేక పోయారు. మీరుకూడా వచ్చినట్టయితే జనక మహారాజు చేసే యాగాన్నీ, ఆ అద్భుతమైన ధనుస్సును చూడగలుగుతారు."





అక్కడ వారంతా స్నానసంధ్యానుష్ఠానా లన్నీ తీర్చుకున్నాక రామలక్ష్మణులు విశ్వామిత్రుడికి ఎదురుగా కూర్చుండి, "స్వామీ, అందమైన వనాలుగల ఈ దేశం ఏది? దీని వృత్తాంతమేమిటి?" అని అడిగారు.

ఆ ప్రశ్నకు సమాధానంగా విశ్వామిత్రుడు ఆ దేశం గురించీ, తన వంశం గురించీ ఇలా చెప్పాడు:

"పూర్వం బ్రహ్మయొక్క కుమారుడు కుశుడనే మహాతపస్వి ఉండేవాడు. ఆయన వైదర్భి అనే ఒక రాజకుమార్తెను పెళ్ళాడి, అవిడకు నలుగురు కుమారులను—కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజసుడు, వసువు అనేవారిని—కన్నాడు. ఆయన క్షత్రియ ధర్మాన్ని పెంపొందించగోరి తన నలుగురు కొడుకులనూ భూమిని పంచుకుని, న్యాయంగా ప్రజా పరిపాలన చేయవలిసిందిగా ఆజ్ఞాపించాడు. వారు కూడా ఆ విధంగానే నాలుగు గొప్ప నగరాలను తమ రాజధానులుగా చేసుకుని రాజ్యపాలన చేశారు. కుశాంబుడి రాజధాని కౌశాంబి; కుశనాభుడి రాజధాని పేరు మహోదయం; అధూర్తరజసుడు ధర్మారణ్యమనే పట్టణాన్ని రాజధాని చేసుకున్నాడు; వసువు అనేవాడు గిరివ్రజం రాజధానిగా పెట్టుకుని

అప్పుడే ప్రయాణ సన్నాహాలు జరిగాయి. విశ్వామిత్రుడు వనపాలకులతో, "నేను మిగిలిన మునులందరినీ వెంట బెట్టుకుని గంగానదికి ఉత్తరంగా హిమాలయాలకేసి వెళుతున్నాను," అని చెప్పి, సిద్ధాశ్రమానికి ప్రదక్షిణం చేసి తిరిగివచ్చాడు.

తరవాత మునులందరూ రామలక్ష్మణులతో ఉత్తరాభిముఖులై బయలుదేరారు. వారి వెనక కొన్నివందల బండ్లమీద సమిధలూ, ఇంధనాలూ మొదలైన అగ్నిసాధనాలు వచ్చాయి. వారు పగలల్లా చాలా దూరం నడిచి అస్తమయ వేళకు శోణానదీ తీరాన్ని చేరుకున్నారు.

పాలించాడు. మనం ఇప్పుడున్నది ఆయన పాలించిన దేశంలోనే.

"ఈ దేశంచుట్టూ అయిదు అందమైన పర్వతాలున్నాయి. ఈ శోణానది ఆ పర్వతాలలోనే పుట్టి ఈ ప్రదేశాన్ని సారవంతంగానూ, సస్యశ్యామలంగానూ చేస్తున్నది. ఇది తూర్పున పుట్టి పడమరకు ప్రవహించే నది.

"కుశుడి కుమారులలో కుశనాభుడనే వాడొకడని చెప్పానుగద. ఆయనకు ఘృతాచి అనే భార్య ఉండేది. వారిద్దరికీ నూరుమంది ఆడపిల్లలు కలిగారు. వారంతా చక్కని చుక్కలు. ఒకనాడు ఆ నూరు మంది కన్యలూ ఆడుతూ, పాడుతూ ఉల్లాసంగా వనవిహారం చేస్తూండగా వాయుదేవుడు వారిని చూసి మోహించి, తనను పెళ్ళాడమని కోరుతూ, అలా చేసినట్టయితే వారిని ముసలితనమూ, చావూలేని దేవతలుగా చేస్తానన్నాడు. కాని ఆ కన్యలు వాయుదేవుణ్ణి తిట్టి, తమ తండ్రి నిర్ణయించిన భర్తను తప్ప చేసుకోమన్నారు. వాయుదేవుడికి ఆగ్రహం వచ్చి వారందరినీ మరుగుజ్జులుగా చేసేశాడు. అప్పుడా కన్యలు ఏడుస్తూ తండ్రి దగ్గిరికి వెళ్ళి జరిగినదంతా చెప్పుకున్నారు.



"తన కుమార్తెలు ప్రదర్శించిన ఐకమత్యమూ, వంశాభిమానమూ చూసి కుశనాభుడు చాలా సంతోషించాడు. వారిని ఇక పెళ్ళిలేకుండా ఉంచటం క్షేమం కాదనుకుని ఆయన, కాంపిల్యపురాన్ని పాలించే బ్రహ్మదత్తుడనే రాజుకు తన కుమార్తెలందరినీ ఇచ్చి పెళ్ళిచేశాడు. బ్రహ్మదత్తుడు తాకగానే వారందరికీ మరుగుజ్జుతనం పోయింది.

"కూతుళ్ల కందరికీ పెళ్ళిచేశాక కుశనాభుడు కొడుకును కోరి పుత్రకామేష్టి చేశాడు. ఆయనకు గాధి అనే ధర్మాత్ముడైన కొడుకు కలిగాడు. ఆ గాధి రాజు కొడుకునే నేను. నాకు సత్యవతి అనే అక్క ఒకామె



ఉండేది. ఆమెను ఋచీకుడి కిచ్చి చేశారు. ఆవిడ మహా పతివ్రత. మేము కుశికవంశం వాళ్లం గనక మమ్మల్ని కౌశికులనికూడా అంటారు. మా అక్క పేరుతో కౌశికి అనే నది ఏర్పడింది. మా అక్కపైగల అభిమానం కొద్దీ నేను హిమవత్ప్రాంతంలో కౌశికీ నదీ తీరానే ఉంటున్నాను. అయితే యాగం నిమిత్తమై సిద్ధాశ్రమానికి వచ్చానన్నమాట. మన కబుర్లతో అప్పుడే సగం రాత్రి గడిచిపోయింది. రామా, ఇక మీరిద్దరూ పడుకుని నిద్రపొండి!"

ప్రయాణపు బడలిక మూలాన రామలక్ష్మణులు ఆ రాత్రి గాఢ నిద్రపోయి, తెల్లవారి విశ్వామిత్రుడు లేపినదాకా లేవలేదు. అప్పుడు వారు కాలకృత్యాలు తీర్చుకుని శోణానదిని అందరూ దాటే రేవులో దాటారు. అది ఆటే లోతైన నదికాదు; ఇసుకతిన్నెలతో చాలా అందంగా ఉన్నది.



వారా నదిని దాటి మళ్ళీ నడక సాగించి మధ్యాహ్నం వేళకు గంగాతీరాన్ని చేరుకున్నారు. పవిత్రమైన గంగను చూడగానే అందరికీ అంతులేని ఆనందం కలిగింది. అక్కడ వారు స్నానం చేసి, దేవతర్పణాలూ, పితృతర్పణాలూ చేసుకుని, హోమం చేసి, భోజనాలు పూర్తిచేసుకుని గంగాతీరాన విశ్వామిత్రుడి చుట్టూ కూచున్నారు. అప్పుడా మహర్షి వారందరికీ గంగయొక్క వృత్తాంతం యిలా చెప్పాడు:

హిమవంతుడనే పర్వతరాజుకు గంగా, ఉమా అని ఇద్దరు కుమార్తెలు. వారిలో పెద్దదైన గంగను దేవతలు పర్వతరాజును బతిమాలి స్వర్గానికి తీసుకుపోయారు. ఉమను పరమశివుడు పెళ్ళి చేసుకున్నాడు. కాలక్రమాన సగర చక్రవర్తి మనమడికి మనమడైన భగీరథుడు గంగను అతి ప్రయాసతో స్వర్గం నుంచి భూమికి తెచ్చి, భూమి నుంచి పాతాళానికి కూడా తీసుకుపోయాడు.








విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు గంగావతరణకథా, కుమారస్వామి జన్మ వృత్తాంతమూ సవిస్తరంగా చెప్పాడు. ఆ రాత్రి వారందరూ గంగయొక్క దక్షిణపు గట్టున గడిపి, మర్నాడు తెల్లవారగానే దర్భాసనాలు పరిచిన పడవలలో ఉత్తరపు గట్టుకు చేరుకున్నారు. అక్కడ వారికి విశాలానగరం కనిపించింది. ఆ నగరాన్ని చాలాసేపు చూసినాక రాముడు విశ్వామిత్రుణ్ణి, "మహామునీ, ఈ నగరాన్ని పాలిస్తున్నది ఏ వంశపు రాజులు? వారి కథ ఏమిటి?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానంగా విశ్వామిత్రుడు, దేవదానవులు క్షీరసాగరాన్ని మథించటమూ, అందులో పుట్టిన హాలాహలాన్ని శివుడు మింగటమూ, అమృతం పుట్టగా దానికోసం దేవదానవులు పోట్లాడుకుంటూంటే విష్ణువు మోహినీ రూపంలో వచ్చి అమృతాన్ని హరించి, తనను ఎదిరించిన వారినందరినీ చంపి, తనను శరణుజొచ్చిన వారిని కాపాడటమూ మొదలైన విషయాలన్నీ చెప్పి, ఇలా అన్నాడు:

. తన కొడుకులందరూ ఇంద్రుడి చేతిలో చనిపోయేసరికి దితి తన భర్త అయిన కశ్యపుడి వద్దకు వెళ్ళి, ఇంద్రుణ్ణి చంపగల కొడుకు తనకు కలిగేటట్టు వరమియ్యవలిసిందని వేడుకున్నది.

"నీవు వెయ్యి సంవత్సరాలు నిష్ఠతో, ఎలాటి మైలకూడా సోకకుండా, తపస్సు చేసినట్టయితే, ఇంద్రుణ్ణి చంపి, ముల్లోకాలూ ఏలగల కొడుకు కలుగుతాడు," అని కశ్యపుడు దితికి వరమిచ్చాడు.

దితి సంతోషించి కుశప్లవసమనే చోట చేరి కఠోరమైన తపస్సు ప్రారంభించింది. ఇంద్రుడు ఆమె వద్దకు వచ్చి ఎంతో భక్తితో ఆమెకు సేవలు చేస్తూ, నీరూ, సమిధలూ, దర్భలూ, కందమూల ఫలాలూ తెచ్చి ఇస్తూవచ్చాడు.





తొమ్మిదివందల తొంభై సంవత్సరాలు గడిచాయి. ఇంకా పదేళ్ళు గడిస్తే దితి గర్భం నుంచి ఇంద్రుణ్ణి చంపగలవాడు బయటికి వస్తాడు. ఒకనాటి మధ్యాన్నం ఈ సంగతి దితి ఇంద్రుడితో చెప్పి, "నాయనా, నాకు విసురుతున్నావు, కాళ్ళు పిసుకుతున్నావు. అందుచేత నాకు పుట్టే కొడుకు నీతో సఖ్యంగా ఉండేటట్టు నేను చూస్తాలే!" అన్నది. అంటూ ఆమె తలను కాళ్ళు పెట్టవలిసిన చోట ఉంచి పక్క మీద పడుకుని నిద్రపోయింది.

ఈవిధంగా ఆమెకు మైలసోకింది. ఇలాటి అవకాశం కోసమే వేచివున్న ఇంద్రుడు



వెంటనే ఆమె గర్భంలో ప్రవేశించి, గర్భంలోని పిండాన్ని తన వజ్రాయుధంతో ఏడు ముక్కలుగా నరికాడు. వారే దేవతా సమానులైన సప్త మారుతాలు.

"రామా, ఆ సమయంలో దితి తపస్సు చేసుకుంటూ ఉంటే ఇంద్రుడు ఈ ప్రదేశంలోనే ఆమెకు సేవలుచేశాడు. అటు తరవాత ఇక్ష్వాకు మహారాజుకు విశాలుడనే కుమారుడు కలిగాడు. అతనే ఈ మహానగరాన్ని నిర్మించాడు. అందుకే దీనికి విశాలా నగరమనే పేరువచ్చింది. ఇప్పుడీ నగరాన్ని వారి వంశానికి చెందిన సుమతి అనేవాడు పాలిస్తున్నాడు," అని విశ్వామిత్రుడు రాముడితో అన్నాడు.

ఈలోపల సుమతికూడా విశ్వామిత్రాదుల రాక తెలిసి బంధు మంత్రి పురోహితులు మొదలైనవారితో ఎదురువచ్చి స్వాగతం చెప్పాడు. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను సుమతికి పరిచయం చేశాడు. వారందరూ ఆ రాత్రికి సుమతి అతిథులుగా ఉండి, తెల్లవారగానే మిథిలానగరానికి ప్రయాణమయారు.

వారు మిథిలను చేరవచ్చే సమయంలో దారిలో ఒక పాడుబడిన ఆశ్రమం కనబడింది. ఆ ఆశ్రమం అందంగా ఉన్నప్పటికీ



అందులో జనసంచారం లేకపోవటానికి కారణమేమిటని రాముడు అడిగాడు.

"నాయనా, ఒకప్పుడీ ఆశ్రమంలో గౌతమ మహాముని తన భార్య అయిన అహల్యతోకూడా సాటిలేని తపస్సు చేశాడు. ఆయనకు ఆగ్రహం తెప్పించి ఆయన తపశ్శక్తి నిర్మూలించాలనే ఉద్దేశంతో, ఇంద్రుడు గౌతముడు స్నానానికిగాను నదికి వెళ్ళి ఉన్న సమయంలో మునివేషం ధరించి అహల్య వద్దకు వచ్చాడు. అహల్య అతని కోరిక తీర్చి పంపేసింది. ఇంద్రుడికి గౌతముడు తడి బట్టలతో ఎదురై, జరిగినది తెలుసుకుని, ఇంద్రుడికి శాపమిచ్చి, ఆశ్రమానికి వచ్చి తన భార్యను కూడా శపించాడు. ఆ శాపం ఫలితంగా ఆమె గాలి తప్ప మరొక ఆహారం లేక, ఎవరికీ కనబడకుండా ఈ ఆశ్రమంలో తపస్సమాధిలో ఉండిపోయింది. నిన్ను చూడగానే ఆమెకు శాపవిమోచనం కలిగేలాగు గౌతముడు అనుగ్రహించాడు గనక మనం ఈ ఆశ్రమం ప్రవేశించి, ఆ అహల్య అందరికీ తిరిగి కనబడేలాగు చేద్దాం," అన్నాడు విశ్వామిత్రుడు.

వారు లోపలికి వెళ్ళేసరికి రాముడి కళ్ళకు సూర్యుడి కాంతితో వెలిగిపోతూ, మోహినీ దేవతను బోలిన అందంగల అహల్య కనిపించింది. ఆమె రాముణ్ణి చూడగానే ఆమెను మిగిలిన వారుకూడా చూడగలిగారు.

రామలక్ష్మణులు వంగి ఆమె కాళ్ళు తాకి నమస్కరించారు. తన భర్త చెప్పిన మాటలు జ్ఞాపకం తెచ్చుకుని అహల్య రామలక్ష్మణుల కాళ్ళు తాకి, వారికి అర్ఘ్యపాద్యాలిచ్చింది. ఆ సమయానికే గౌతముడు కూడా తిరిగివచ్చాడు.

విశ్వామిత్రుడు అక్కడి నుంచి బయలుదేరి, రామలక్ష్మణులను వెంట బెట్టుకుని మిథిలానగరం ప్రవేశించాడు.



# మధురమీనాక్షి ఆలయం

మధురమీనాక్షి ఆలయం యావద్భారత ప్రశస్తి గల ఆలయాలలో ఒకటి. ఇందులో ఉత్తమమైన ద్రావిడ వాస్తు శిల్పకళ లున్నాయి. ఈ ఆలయం చుట్టూ తొమ్మిది ఎత్తయిన గోపురాలున్నాయి. ఆలయ ముఖద్వారం తూర్పుగా ఉంటుంది.

ఆలయ ప్రాకారం లోపల రెండు గర్భాలయా లున్నాయి. ఒకటి మీనాక్షిది, రెండవది ఆమె భర్త అయిన సుందరేశ్వరుడిది. ఇక్కడ శివుడే సుందరే శ్వరుడని పిలవబడతాడు.

ఆలయానికి ఎదురుగా కంబత్తాడి మండపం ఒకటి ఉన్నది. ఇక్కడి స్తంభాలపైన శివుడి లీలలు చెక్కి ఉన్నాయి. వెయ్యి స్తంభాల మండపం అతి విచిత్రమైన కట్టడం. ఇందులో 985 స్తంభా లున్నాయి. దీనిని 1560 లో నిర్మించారు. కొన్ని స్తంభాలపైన అద్భుతమైన చెక్కడాలున్నాయి.

మండపం యొక్క వెలుపలి నడవలో స్వర స్తంభాలున్నాయి. (బొమ్మచూడండి.) ఈ స్తంభా లను కొట్టినట్టయితే ఒక్కొక్క స్తంభమూ ఒక్కొక్క స్వరం పలుకుతుంది.

ఆలయం వెలపల తూర్పుపక్క వసంత మండపం ఉన్నది. ఈ మండపంలో నాయక రాజుల శిలాప్రతిమలు, వాస్తవ ప్రమాణాలు గలవి, ఉన్నాయి. విజయనగర రాజవంశానికి చెందిన నాయక రాజులు 17 వ శతాబ్దంలో ఈ నగరాన్ని చాలా అభివృద్ధిలోకి తెచ్చారు. అంతకు పూర్వం—14 వ శతాబ్దం వరకు—మదురను పాండ్య రాజులు పాలించారు. ఇది పుణ్యక్షేత్రమే గాక తమిళ సాహిత్యానికి గొప్ప కేంద్రంగా కూడా ఉండేది. ఒకప్పుడు మీనాక్షి ఆలయంలోని ఒక కోనేరులో గ్రంథాలను వేసేవారట. గ్రంథం తేలితే గొప్ప గ్రంథమన్నమాట!






1. *జి. బాబారాయుడు, కమలాపురం*

ఇప్పుడు రెండు అట్టలకు ఇరువైపుల వ్యాఖ్యల ఫొటోలు వేయకుండుటకు కారణ మేమండీ?

"చందమామ" అట్టలు ఆఫ్‌సెట్‌లో అచ్చవుతున్నాయి. అందుచేత అట్టలపై ఫొటోలు ముద్రించటం అసాకర్య మయింది.

2. *పి. నందకుమార్, కేసముద్రం*

"రాకాసిలోయ" రచయితకూడ శ్రీ దాసరి సుబ్రహ్మణ్యంగారేనా?

అవును.

3. *శెట్టి వెంకట నాగభూషణరావు, విశాఖపట్టణం*

ఫొటో వ్యాఖ్యల పోటీ గడువు పొడిగించితిరా? ఎందుచేత?

వ్యాఖ్యల ఫొటోలు లోపల వెయ్యటంచేత తేదీ పొడిగించే అవకాశం కలిగింది. ఇది పాఠకులకు సౌకర్యంకూడానూ.

4. *అందే దయాసాగర్, రాజమండ్రి*

అన్నయ్యా, "బాలకాండ"లో [జూన్] దశరథునకు పాయసముతో పాత్ర ఇచ్చినది దివ్యపురుషుడని మేము తరగతి పుస్తకములో చదివితిమి. మహా భూతమని వ్రాసేరేమి?

ఈ మహా భూతం దివ్యపురుషుడు కాడని ఎవరన్నారూ? కనీసం బొమ్మ చూసినా ఆ విషయం స్పష్టమవుతుందే!

5. *వరహాగిరి అంజనాదేవి, సామర్లకోట*

తాతయ్య కథలు మానివేశా రేమి?

చేతిలో ఉన్న కథలు ముగియటం వల్ల నిలిపాం. మళ్ళీ వాటిని ప్రచురించటానికి ప్రయత్నిస్తాం.

6. డి. వి. వేనులు, భిలాయ్

చందమామయ్యా, బేతాళ కథలన్నీ పుస్తకంగా అచ్చు వేయిస్తే బాగుండదూ ?

బాగానే ఉంటుంది. ఒక్క బేతాళ కథలేకాదు, "చందమామ"లో పడిన అనేక సీరియల్ .కథల పుస్తకాల కోసం పాఠకులు అడుగుతున్నారు. కాని ఆ పని చెయ్యటానికి అవకాశం చిక్కటంలేదు.

7. వి. ప్రభావతి, పూరి

అన్నయ్యా, మన "చందమామ" పూర్ణయోగము గలదా, అర్ధయోగము గలదా ? గ్రహణ దోషములు ఎప్పుడైన పట్టినవా ?

"చందమామ" పూర్ణయోగం కలదే గాని గ్రహణదోషాలు అంతో ఇంతో ఉంటూనే ఉన్నాయి. కాగితం మొదలైన ముడిసరుకుల ధరలు పెరిగిపోతున్నాయి. అవి దొరకటంకూడా లేదు. లైసెన్సులూ, పర్మిట్లూ, కోటాలూ మొదలైన వాటితో "చందమామ" కత్తిమీదిసాము చేస్తున్నది.

8. కొండూరి శశిభూషణం, గూడూరు

అన్నయ్యా, "జ్వాలాద్వీపం" లో కథా నాయకుడు చిత్రసేనుడా, ఉగ్రదత్తుడా ?

అది రెండు తరాల కథ. మొదట చిత్ర సేనుడు నాయకుడు, తరవాత ఉగ్రదత్తుడు.

9. కె. సుశీల, ఏలూరు

అన్నయ్యా, మేము సొంతముగా కథలు వ్రాసి పంపిన "చందమామ"లో వేసుకొందురా ?

"చందమామ"లో ప్రచురితమవుతున్న కథలు చాలా భాగం ప్రాచీన కథలు.

10. టి. జయప్రకాశ్, నిజామాబాద్

మహాభారతం [జూన్]లో భీముడు దుశ్శాసనుని వధించి "మృత్యుదేవత నిన్ను కాపాడింది," అంటాడు, దీని అర్థమేమిటి ?

భీముడికి దుశ్శాసనుడిపై పగ మిగిలి ఉండగానే దుశ్శాసనుడు మరణించాడు. మరణించిన వాణ్ణి భీముడిక సాధించలేడు.

11. బి. సంగయ్య, పాపన్నపేట

కైలాస పర్వతాన్ని ఎత్తగలిగిన రావణుడు శివధనుస్సును ఎత్తలేక పోవుటకు కారణం ?

సీతను పెళ్ళాడే గీత లేక కావచ్చు.

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

భా మ నే

పంపినవారు:
ఎస్. మధు, చెంగనపల్లి

Photo by Pranlal K. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

స త్యా భా మ నే

పంపినవారు :
ఎస్. మధు, చెంగనపల్లి

# అట్టచివరి బొమ్మ

కర్ణుడు పడిపోగానే పాండవ సైనికులూ, కృష్ణార్జునులూ శంఖాలూదారు. ఒకరి నొకరు కౌగలించుకుని గంతులు వేశారు. కౌరవయోధులు ఒక్కొక్కరే వచ్చి కర్ణుడి శవాన్ని చూసి దుఃఖించారు. భీముడు సింహగర్జనలు చేస్తూ, మల్ల చరుస్తూ, భయంకరంగా నాట్యం చేశాడు.

దుర్యోధనుడు తన యోధులు బెదిరి ఉండటం చూసి, తానొక్కడే పాండవ వీరులతో పోరాడ యత్నించాడు. శల్యుడు వచ్చి, "దైవనిర్ణయం ఈ విధంగా ఉన్నది. ఏం చేస్తాం? సూర్యాస్తమయం కావస్తున్నది. ఈ రోజుకు యుద్ధం కట్టిపెట్టి శిబిరానికి పోదాం," అన్నాడు.

కృష్ణార్జునులు ధర్మరాజు వద్దకు వెళ్ళి కర్ణవధ గురించి చెప్పేసరికి ఆయన బయలు దేరి వచ్చి, యుద్ధరంగంలో పడి ఉన్న కర్ణుణ్ణి చూశాడు.

కృపుడు దుర్యోధనుడి వద్దకు వచ్చి, "ఎవరి కోసం మనం విజయాన్ని కోరామో వారంతా చచ్చారు. ఇప్పటికైనా మనం సంధి చేసుకోవటం మంచిది," అని చెప్పాడు. దుర్యోధనుడు ఆయనతో, "సంధి వల్ల మనకు కలిగే సుఖం లేదు, రాజ్యమూ లేదు. అంత కంటె చివరిదాకా పోరాడి చచ్చి వీరస్వర్గం పొందటం మేలు," అన్నాడు.

కర్ణుడు పోయాడు గనక కొత్త సేనానాయకుడు కావాలి. అశ్వత్థామ సడిగితే శల్యుణ్ణి సూచించాడు. శల్యుడు సమ్మతించాడు. ఆ రాత్రి కౌరవులు నిద్రపోయి మర్నాడు శల్యుణ్ణి సేనానాయకుడుగా అభిషేకించి, ఆఖరు రోజు యుద్ధానికి బయలుదేరారు.

శల్యుడు అతి భయంకరమైన యుద్ధం చేశాడు. ఒకసారి ఆయనకూ భీముడికీ మధ్య గదాయుద్ధం జరిగింది. ఇద్దరూ మూర్ఛపోయారు. భీముడికి స్పృహ వచ్చేలోపుగా కృపుడు వచ్చి, శల్యుణ్ణి తన రథంమీద పెట్టుకుని తీసుకుపోయాడు.

తరవాత శల్యుడు ధర్మరాజుతో తన చివరి యుద్ధం చేశాడు. ఈ యుద్ధంలో ధర్మరాజు శల్యుడిపైన ఒక శక్తి ప్రయోగించి ఆయన ప్రాణాలు తీశాడు. శల్యుడు చచ్చిపోగానే శల్యుడి తమ్ముడొకడు ధర్మరాజుతో తలపడి తానుకూడా చచ్చిపోయాడు. అప్పటికి మధ్యాన్నమయింది.

కౌరవ సైన్యంలో హాహాకారాలు బయలుదేరాయి. సైన్యం చెల్లాచెదరై పరిగెత్త సాగింది. సాత్యకి ఆ సైన్యాన్ని వెంబడించి నిర్మూలించ నారంభించాడు.

ఇంతలో కౌరవయోధులలో ఒకడైన సాళ్వుడు విజృంభించి యుద్ధానికి వచ్చి, సాత్యకితో యుద్ధం చేసి తన ప్రాణాలు పోగొట్టుకున్నాడు. ఉభయ పక్షాలా చావగా మిగిలిన యోధులు ద్వంద్వయుద్ధం సాగించారు. ఆ యుద్ధంలో దుర్యోధనుడు గొప్ప శౌర్యపరాక్రమాలు ప్రదర్శించాడు.

శకుని తన సేనతో సహా పాండవసేనలను వెనుకనుంచి పీడించసాగాడు. ఇది చూసి సహదేవుడు కొంత బలంతో వెళ్ళి శకునిపై పడ్డాడు. రెండు గడియలపాటు యుద్ధం జరిగాక శకుని, చావగా మిగిలిన తన బలాలతో యుద్ధరంగం నుంచి పారిపోయాడు.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వాఖ్యలు 1961 అక్టోబర్ సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఆగస్టు నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : భామనే

రెండవ ఫోటో : సత్యభామనే

పంపినవారు : ఎస్. మధు

చెంగనపల్లి, సైదాపురం (P.O.) నెల్లూరు జిల్లా.

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూల దగ్గిరకు గొర్రెలు కాచే కుర్రాడు ఒక కోతిని వెంట బెట్టుకు వచ్చి, "ఒక గొంగళీ యిచ్చి, ఈ కోతిని గారడీ వాడి దగ్గిర కొన్నాను. చూడండి, దీనితో ఎన్ని తమాషాలు చేయిస్తానో!" అంటూ తన చేతిలో వున్న కొంకి కర్రను కోతికి చూపి, "దీని మీదికి ఎగిరి కూచో!" అన్నాడు. కోతి కొంకి కర్ర మీదికి ఎగిరి కూచున్నది. ఇదంతా చూస్తున్న, "టైగర్" వెనగ్గా వెళ్లి కోతి తోకను గట్టిగా కొరికింది. దానితో కోతికి శివమెత్తి కొంకికర్రను చేతపట్టుకుని పారిపోసాగింది. "అయ్యో, నా కోతి, నా కొంకికర్ర!" అంటూ గొర్రెల కుర్రాడు దాని వెంటపడ్డాడు. దాసూ, వాసూలు పొట్టలు చెక్కలయేలా నవ్వుకున్నారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


పసుపుపచ్చ
LUX
Yellow


ఆకుపచ్చ
LUX
Green


నీలం
LUX
Blue


లేత గులాబి
LUX
Pink



USHA




వాయిదా పద్ధతుల మీద గూడా దొరకును.

# ఉషా అత్యధిక అమ్మకములు



నాణ్యతకు
పెట్టింది పేరు.

జే ఇంజనీరింగు వర్క్సు లిమిటెడ్, కలకత్తా-31.

నేడే చూడండి!











చేతనా
ఫిలింస్ వారి

# గుళ్లో పెళ్లి

దర్శకత్వం.. కె.యస్.ప్రకాశరావు

నిర్మాత.. డి.జి.ప్రసాదరావు

రచన..అనిసెట్టి సంగీతం..రమేష్

STUDIO

ఆంధ్ర:పరమేశ్వరీ, నైజాం:మహేశ్వరీ, మైసూర్: మహాశక్తి మూవీస

